Regd. No. A. 136

# ఆంధ్రప్రదేశ్

జ్యేష్ఠ-ఆషాఢ 1884 శకం

సంచిక: 8

సంపుటి: 6

జూన్, 1962





సంపాదకుల సమావేశం:— అఖిలభారత వార్తా పత్రికా సంపాదకుల సభకుచెందిన స్థాయీ సంఘ సమావేశాన్ని ఏప్రిల్ 29 వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి హైదరాబాదులో ప్రారంభించారు.

వరంగల్‌లో మార్చి 16 వ తేదీనుంచి 18 వ తేదీవరకు జరిగిన ప్రాంతీయ నాటక, పాటల పోటీలలో ప్రథమ బహుమతి పొందిన "వెలుగు" నాటికలో ఒక దృశ్యం.

సంపుటి: 6 సంచిక: 8

# ఆంధ్రప్రదేశ్

సచిత్ర మాస పత్రిక

జూన్, 1962

జ్యేష్ఠ-ఆషాఢ 1884 శకం

సంవత్సర చందా:
3 రూపాయలు

విడిప్రతి వెల
25 నయాపైసలు

# విషయసూచిక



**ముఖచిత్రం:** ప్రపంచంలోకెల్లా బ్రహ్మాండమైన నాగార్జునసాగర్ డామ్ నిర్మాణ దృశ్యం

**వెనుకఅట్ట:** “వేసవి విశ్రాంతి”



# మన రాష్ట్రపతి
# భారత తాత్త్విక రాజనీతిజ్ఞుడు
## డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్

★

శ్రీ సి. వి. హెచ్. రావు

న్యూఢిల్లీ కింగ్ఎడ్వర్డు రోడ్డులోని రెండో నెంబరు ఇంటి వద్ద మొన్న మొన్నటి వరకు ఒక వ్యక్తి—బక్క పల్చగా పొడుగ్గా వుండే ఒక మహా మనీషి—తనను చూడ వచ్చిన వారిని అభినందిస్తుండేవారు.

ఆ రెండో నెంబరు గృహమే భారత ఉపరాష్ట్రపతి అధికార నివాసం.

ఆ మహామనీషే నేటి భారతావని ప్రథమ పౌరుడు, నూతన రాష్ట్రపతి అయిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్.

ఇంటి వద్ద మామూలుగా వేసుకునే ధోవతి, పంచె ధరించి ఆయన తనను చూడవచ్చిన పెద్దవారినీ, చిన్నవారినీ, అధికారులను అనధికారులను, గొప్పవారిని సామాన్యులనుకూడా చిరునవ్వులు చిలకరిస్తూ మాట్లాడిస్తారు. అట్టే ఆడంబరాలు లేకుండా ఆయన వారితో మాట్లాడి వాళ్ళను గురించి విచారించి, తనతో వాళ్ళకున్న పరిచయాన్ని బట్టి తగు సూచనలిచ్చి, వారి పనుల పట్ల హృదయపూర్వకమైన ఉత్సాహాన్ని చూపుతారు.

డాక్టర్ రాధాకృష్ణన్ కింగ్ ఎడ్వర్డు రోడ్డులోని రెండో నెంబరు గృహం నుంచి రాష్ట్రపతి భవనానికి మారినా ఎక్కువ మార్పేమీ వుండదని ఎవరైనా అనుకోవచ్చు. కాని రాష్ట్రపతిగా నియమబద్ధమైన దినచర్యకు కట్టుబడి వుంటారు గనక వారి కార్యక్రమాలలో కొన్ని పరిమితులుండడం తప్పనిసరి అవుతుంది. అయినా వారు ఆ నిబంధనలకు పూర్తిగా కట్టుబడి వుండక కనీస నిబంధనలనే పాటిస్తారు. ఇది ఆయన స్వభావం. వివిధ దేశాల రాయబారులకు దౌత్య ప్రతినిధులకు ఇచ్చే స్వాగతోత్సవాలకు, ఇటీవల నానాటికి అధికమవుతున్న ముఖ్యమైన వ్యక్తులను కలుసుకోవడం, లాంఛన ప్రాయమైన పెరేడ్లకు, సైనిక వందనాలకు, పెక్కు అంతర్జాతీయ సభలకు సమావేశాలకు ప్రారంభోత్సవాలు చేయడం వంటి అనేక అధికార ఉత్సవాలకు రాష్ట్రపతి హాజరు కావలసి వుంటుంది. అయితే డాక్టర్ రాధాకృష్ణన్ ఇటువంటి కార్యక్రమాలకు కొత్త కాదు వారు ఇటువంటి కార్యక్రమాలను అతితేలికగా, గంభీరంగా నిర్వహించగలరు వారితో పరిచయం వున్న ఎవరికైనా—ఏ పనినైనా తేలిగ్గా గంభీరంగా నిర్వహించే—ఈ రెండు గుణాలు ముఖ్యంగా గోచరిస్తాయి.

### సమన్వయ దృక్పథం

డాక్టర్ రాధాకృష్ణన్‌కు జీవితం పట్ల తాత్త్విక దృక్పథం వుంది. వారు అగాధమైన భారతీయ సంస్కృతీ సాగరం లోతులకు

వెళ్ళి మున్కలు వేశారు. అంతే కాదు పాశ్చాత్య తాత్త్విక, సంస్కృతీ వసంతాలలోని మధువును ఆయన తనివితీరా ఆస్వాదించారు. ప్రాచ్య పాశ్చాత్య దృక్పథాల మేలుకలయిక వారిలో ప్రతిబింబిస్తుంటుంది. ఈ బాహ్య ప్రపంచంతో ఏవీ సంబంధం లేకుండా ఎక్కడో సుదూరంగా ఏకాంత ప్రశాంత జీవితాన్ని గడపాలనే ధ్యేయం తత్త్వవేత్తలది. అయితే డాక్టర్ రాధాకృష్ణన్ ఈ ధ్యేయం కల తత్త్వవేత్తలకోవకు చెందరు. క్రమశిక్షణ గల జీవితానికి సత్కర్మ, ఉన్నతాశయ సాధనకు నిరంతర కృషి అవసరమని, భగవద్గీత తత్త్వానుగుణంగా భావించే మహా తాత్త్వికులు వారు.

డాక్టర్ రాధాకృష్ణన్ జీవితంలోని ఈ ముఖ్య లక్షణాన్ని నిరూపిస్తూనే ఆయన జీవితపు బాట ముందుకు సాగింది. మద్రాసు విద్యారంగంలోని ఒక గౌరవనీయమైన ఉన్నత పదవినుంచి వారు తమ శక్తి సామర్థ్యాలతో కలకత్తా విశ్వ విద్యాలయంలో ఆచార్య పీఠాన్ని అలంకరించారు. ఆ తరువాత ఆంధ్ర, కాశీ విశ్వ విద్యాలయాలకు ఉపాధ్యక్షులుగా, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ అధ్యక్షులుగా దేశంలో విశ్వవిద్యాలయ విద్యాభివృద్ధికై ప్రశంసనీయమైన సేవ చేశారు. వారు ఒక ప్రముఖ విద్యావేత్తగా - కేవలం విజ్ఞానాన్ని పెంపొందించే వారుగా కాక, విశాల దృక్పథాన్ని అలవరచి విద్యార్థులను బుద్ధికుశలులుగా చేసే - పూర్వ కాలంనాటి ఆచార్యుల, మహా పండితుల కోవకు చెందినవారు. ఆయన ఒక మహా పండితుడుగా, విజ్ఞాన ఖనిగా అసంఖ్యాకమైన మహాసభలలో ప్రసంగించడానికి, హిందూ తత్త్వ శాస్త్రాన్ని గురించి ఖండ ఖండాంతరాలలో నాటి చెప్పడానికి అనేక సార్లు ఆహ్వానితులవడమే గాక ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో - ప్రాచ్య మతాలనుగురించి బోధించే - గౌరవాచార్య స్థానంలో నియమింపబడి మన్నిడుల మన్ననలందుకున్నారు.

విద్యావేత్త ఒక రాజకీయ వేత్తగా మారడం అంటే కష్టసాధ్యమైంది. అది దుస్తరమైన కార్యం. వివాద గ్రస్తంగా వున్న విభిన్న రాజకీయ పక్షాలకు విదేశీయులకు స్వతంత్ర భారత తాటస్థ్య వైదేశిక విధానాన్ని మాస్కోవంటి రాజధాని నగరంలో సరిగ్గా వ్యాఖ్యానించి చెప్పడానికై డాక్టర్ రాధాకృష్ణన్‌ను ప్రధాన మంత్రి ఎన్నుకున్నారు. అప్పటికి మాస్కో యదార్థ పరిస్థితి ఏ రాయబారికీ అంతు చిక్కలేదు. అక్కడికి రాయబారిగా వెళ్ళడమంటే జీవిత ప్రతిష్ఠను పందెం వేసి కోల్పోవడానికి సిద్ధపడటమే నన్నమాట. కాని సోవియట్ నియంత స్టాలిన్ తన చుట్టు ఏర్పరచుకున్న ఇనుప తెరలను డాక్టర్ రాధాకృష్ణన్ తుత్తునియలు చేసి అందరూ ఊహించిన దానికన్నా అఖండమైన విజయాన్ని సాధించారు. తత్ఫలితంగా సోవియట్ యూనియన్ ఇండియాల మధ్య సత్సంబంధాలు, సుహృద్భావం నెలకొల్పబడినాయి. ఆ తర్వాత రష్యాలో ఎన్ని మార్పులు వచ్చినా ఈ రెండు దేశాల సంబంధ బాంధవ్యాలకు ఏ మాత్రం భంగం వాటిల్లలేదు. ఆ విధంగా తొలిసారిగా ఇండో - సోవియట్ సంబంధాలలో తంత్రులను మీటింది ఆయనే

## దౌత్య ప్రతినిధి

రష్యాలో రాయబారి పదవిని విజయవంతంగా నిర్వహించిన తర్వాత డాక్టర్ రాధాకృష్ణన్‌కు మరొక మార్పు వచ్చింది. దేశం మొత్తం మీద ఒక ఉన్నత బాధ్యతాయుత పదవి ఐన ఉప రాష్ట్రపతి పదవిని వారి భుజస్కంధాలపైనిడి వారి సేవను స్వదేశంలో వినియోగించు కున్నారు ప్రధాన మంత్రి. డాక్టర్ రాధాకృష్ణన్ తమ పదవిలో వుండి రాజ్య సభాధ్యక్షుడుగాను రాష్ట్రపతి విదేశాలకు వెళ్ళినపుడు, అస్వస్థులైనపుడు నిర్వహించిన విధులు కేవలం నామ మాత్రమైనవి కావు. ఆయన ఆ విధులను ఎంతో గంభీరంగా, పవిత్రంగా నిర్వహించారు. వాస్తవానికి వస్తే ఆయన ఒక ప్రముఖ భారత దౌత్య ప్రతినిధిగా, ప్రధాన మంత్రి వ్యక్తిగత ప్రతినిధిగానే గాక అంతర్జాతీయ శాంతి సుహృద్భావాలకు కృషి చేశారు. ఇందుకు ఆయన విద్వత్ప్రకర్ష, వక్తృత్వ ప్రభావం, పాండిత్యం ఎంతో తోడ్పడ్డాయి. తత్వవేత్తగా ఆయన కున్న స్థానం మహోన్నతమైంది. మేధావిగా ఆయన అసాధారణ శక్తి యుక్తుడయిన వ్యక్తి. వక్తగా ఆయనకు ఆయనే సాటి. నేటి రాష్ట్రపతికి వున్న భావ ప్రకటన, వ్యక్తృత్వ ప్రభావం గలవారు నేటి ప్రస్తుత భారత దేశంలోనే కాదు ప్రపంచం మొత్తం మీద వేళ్ళ మీద లెక్కించదగినంత మంది మాత్రమే వున్నారు. అంతర్జాతీయ పండితుల, విజ్ఞానవేత్తల మహా సభ గాని, ప్రపంచ ఖ్యాతిగాంచిన విద్యా వేదికలమీద గాని, ప్రముఖ సంస్థల, సంఘాలలోగాని, విశ్వ విద్యాలయ స్నాతకోత్సవంలో గాని, ప్రపంచ మత నాయకుల మహా సభ కాని ఎక్కడైనా సరే ఆయన తన విద్వద్గరిమతో వక్తృత్వ పాటవంతో మానవత్వాన్ని మనసులను ఉత్తేజపరచే మహత్తర నూతన నాశయాలను ప్రబోధిస్తారు. వారు ఏం చెప్పినా హిందూ తత్వ, సంస్కృతుల నేపథ్యానికి వ్యతిరేకంగా చెపుతారనడం ఆయన పాండిత్య ప్రకర్షకు హద్దు లేర్పరచడమే అవుతుంది. భారతీయ, హైందవ తత్త్వ

శాస్త్ర వేత్తలలో ఆయన ఒక ప్రముఖ వ్యక్తి. కాని ఇటీవలి ఆయన ఆలోచనలు భావాలు దేశ సరిహద్దుల నదిగ మించి విశ్వ విఖ్యాతి గన్న ప్రపంచ నాయకుల కోవలో చేరాయి. ప్రముఖ తత్వ వేత్త బెర్ట్రేండ్ రస్సెల్ రాధాకృష్ణన్ గురించి—" ఆయన నాకోవకు చెందినవారే. ఆయన ఆకర్షణీయమైన వ్యక్తిత్వం, విశాలదృక్పథం గల తాత్వికుడు, నిజమైన తాత్త్విక చింతన గల మనీషి" అన్నారు.

ఆయన సేవలకు వివిధ రాజకీయ పక్షాలవారు గత రాజ్య సభ చివరి సమావేశంలో నివాళులర్పించినారు ఆయన ఎవరినీ బాధ పెట్టకుండా అతి గాంభీర్యంగా తమ రాజ్య సభాధ్యక్ష పదవిని నిర్వహించారు సభా కార్యక్రమాలలో ఆయన సునిశిత హాస్యం ప్రకాశిస్తుంటుంది ఆయన ఒక చిన్న నగ్న సత్యాన్ని చెప్పి గాని, కేవలం ఒకే ఒక వేలను చిన్నగా కదిలించి గాని చర్చలో పాల్గొన్న సభ్యుల ఉద్రేకాన్ని చల్లచిరచి సభను ప్రశాంతంగా నిర్వహిస్తారు.

## పరస్పర అవగాహన

డాక్టర్ రాధాకృష్ణన్, ప్రధాన మంత్రి నెహ్రూల మధ్య పరస్పర అవగాహన, వారిపరస్పర గౌరవాభిమానాల మీద ఆధారపడి వుంటుంది. ప్రధాన మంత్రి స్నేహితులలో గాని, సహచరులలో గాని ప్రధానితో కొందరే మాట్లాడ గలరు. శ్రీ నెహ్రూకు జాతీయ, అంతర్జాతీయ విధానాలపై సిద్ధమైన పరిజ్ఞానంతో సలహా లివ్వగల కొద్ది మందిలో డాక్టర్ రాధాకృష్ణన్ ఒకరు ఆయన ప్రజ్ఞాపాటవం, విచక్షణా జ్ఞానం దేశానికి అమూల్య ధనం. ఆయన ఇప్పుడు రాష్ట్రపతిగా వున్నారు. గనుక ఈ రెండూ ఎంతో ఉపయోగ పడగలవు. ఆయన ఇదివరకు కన్నా ఇప్పుడు జాతీయ విధానాలను నిర్దిష్టంగా తీర్చి దిద్ది వాటిని అమలు జరపడానికి అవకాశముంది. అంతేగాదు అది తప్పనిసరి కూడా. మహాభారమైన దేశబాధ్యతలను ప్రధాన మంత్రితో పాటు ఆయన కూడా పాలు పంచుకుంటారు. ఈ విధానాలకు ప్రధాన మంత్రి, మంత్రివర్గాల బాధ్యత ప్రముఖమైంది. కాని రాష్ట్రపతి ఏమైనా చేయగలగాలంటే అది ఆయనకు ప్రధాన మంత్రితో వున్న సంబంధంతోను, ప్రధానికి ఆయన పట్ల వున్న నమ్మకం మీద ఆధారపడి వుంటుంది ఈ సందర్భంగా గౌరవాభిమానాలను పరస్పరంగా ఇచ్చిపుచ్చుకునే విధానం ఎంతో సహకరిస్తుంది.

భారత రిపబ్లిక్ ప్రథమ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్, ఆయన వారసుడు డాక్టర్ రాధాకృష్ణన్‌ల జీవనగతి, ఉన్నతాశయాలు ఎంతో మహోత్కృష్టమైనవి.

విట్టర్ (Whitter) ఇలా అన్నాడు.

"An inborn grace that nothing lacked,
Or culture and appliance -
The warmth of genial courtesy
The calm of self - reliance.

అంటే వీరిరువురిలో హైందవ సంస్కృతీ ఛాయలు అంతర్భూతమై ఉంటాయి. మానవత్వం, మన్నన మర్యాద, ఆత్మ విశ్వాసం వల్ల కలిగే ప్రశాంతత వీరిరువురిలో మనకు గోచరిస్తాయి

ప్రపంచం ప్రమాదకరమైన క్లిష్ట పరిస్థితుల నెదుర్కొనే టప్పుడు, ప్రపంచాన్ని భయం, కారుచీకట్లు ఆవరించినపుడు మానవజాతి సమస్తాన్ని తుడిచిపెట్టివేసే అణ్వస్త్ర యుద్ధావకాశం వున్నపుడు, ప్రపంచమంతా ఆయన్ను అంతర్జాతీయ వ్యక్తిగా ఎంచి—ప్లేటో వ్రాసినట్లు తాత్విక రాజకీయవేత్తలలో వుండవలసిన గుణాలు మూర్తీభవించి వున్న—ఆయన పలుకులకోసం చెవులు రిక్కిస్తుంది. డాక్టర్ రాధాకృష్ణన్ ఒక పరిమిత నిబంధనలున్న ఉన్నత పదవిలో వున్నా ఆయన మహోన్నత స్వరానికి మాత్రం ఎటి అడ్డంకు రాదని మనం ఆశిద్దాం రానున్న ఐదేళ్ళలో అంతర్జాతీయ వ్యవహారాలలో భారతదేశ వైదేశిక విధానపు ధ్యేయాన్ని విశ్వశాంతికై, నైతిక ఆధ్యాత్మిక ప్రాతిపదికలపై పలుమార్లు చాటిచెప్పే సందర్భాలు ఎన్నో ఆయనకున్నాయి

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ భారత రిపబ్లిక్ రాష్ట్రపతి పదవి నలంకరించిన సందర్భంగా ఆయన కర్పిస్తున్న ఈ నివాళిని విశ్వశాంతిని కోరే ఈ క్రింది ప్రాచీన శ్లోకంతో ముగించడం సముచితం.

సర్వే భవతు సుఖినః,
సర్వే సంతు నిరామయః,
సర్వే భద్రాణి పశ్యంతు
నకశ్చిత్ దుఃఖభాగ్ భవేత్
శాంతిః, శాంతిః, శాంతిః.

(ఆంగ్ల మూలం)

# శాలివాహనుల పాలనా విధానం

శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావు

మౌర్య సామ్రాజ్యం అస్తమించిన తర్వాత, దక్షిణాపథంలో మహా సామ్రాజ్యాన్ని స్థాపించి, నాలుగు వందల ఏభై సంవత్సరాల కాలం అవిచ్ఛిన్నంగా పాలించిన వీరజాతి "ఆంధ్రశాత (లి) వాహనులు". మొదట వీరు మౌర్య చక్రవర్తులకు సామంతులుగా ఉండేవారు. అశోకుని మరణానంతరం సుమారు క్రీ. పూ. 230 లో "శ్రీముఖుడు" అనే శాతవాహనుడు స్వతంత్రుడై ఆంధ్ర సామ్రాజ్యాన్ని స్థాపించాడు. పురాణాల్లో ఆంధ్ర రాజుల పేర్లున్నాయి. వారి పరిపాలనాకాలాన్ని కూడా వివరించారు. మత్స్య పురాణంలో 30 రాజుల పేర్లున్నాయి. వీరు 450 సంవత్సరాలు పరిపాలించినట్లు తెలుస్తోంది. వీరి పరిపాలన ఎప్పుడు ప్రారంభమయిందో నిశ్చయంగా చెప్పలేము. సుమారు క్రీ. పూ. 234 లో ప్రారంభమై ఉంటుందని ఊహింపవచ్చు. వీరి రాజధాని విషయంలో కూడా అభిప్రాయ భేదాలున్నాయి. మచిలీ పట్టణం సమీపంలో ఉండే "శ్రీకాకుళం" అని కొందరు. "ప్రతిష్ఠాన పురం" (పైఠాన్) అని మరి కొందరు. "ధాన్యకటకము" (లేక ధరణి కోట) అని ఇంకా కొందరు అభిప్రాయ పడుతున్నారు. శ్రీకాకుళం రాజధాని అనడానికి కేవలం కథలే ఆధారం. మొదట ధాన్యకటకం రాజధానిగా ఉండేదనిన్నీ, శాతవాహన రాజులు మహారాష్ట్ర దేశాన్ని జయించి ఆంధ్ర దేశంలో కలుపుకొన్న పిమ్మట "ప్రతిష్ఠాన పురం" పశ్చిమ రాజధానిగా చేసుకొని వుంటారని చెప్పవచ్చును. అత్యున్నత స్థితిలో ఈ ఆంధ్ర మహా సామ్రాజ్యం ఉత్తరాన 'శాలిగుండం' మొదలుకొని, దక్షిణాన "చిన గంజాము" వరకున్నూ, పడమర "గుత్తి" మొదలు తూర్పున "భట్టిప్రోలు" వరకున్నూ వ్యాపించి ఉండేది. శాతవాహనుల పరిపాలనలో నున్న రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులను, మత విశేషములను పరిశీలించినట్లైతే, ఆ నాడు ఆంధ్ర జాతి ఎంతటి మహత్తర నాగరికతతో విలసిల్లుతుండేదో తెలియవస్తుంది ॥

## పాలనా విధానం

ఈ విశాల సామ్రాజ్య పరిపాలన అతిసున్నితంగా, మిక్కిలి తేలికగా కొనసాగి పోయేది. స్థానిక పరిపాలనంతా సామంతుల ఆధీనంలో ఉండేది. వీరిపై రాజోద్యోగుల అజమాయిషీ ఉండేది. సింహాసనం రాజ కుటుంబంలో పురుష సంతతికి వంశపారం పర్యంగా సంక్రమించేది. సింహాసనాన్ని అధిష్ఠింప వలసిన రాకుమారుడు మైనారిటీ వయస్సులో ఉన్నట్లయితే, రాజ్యాధికారాలన్నీ చక్రవర్తి సోదరునకుగానీ, మహారాణి సోదరునకుగానీ వశమై వుండేవి. చక్రవర్తుల నామధేయములకు "శాతకర్ణి" అనే పేరు వంశపారం పర్యంగా వచ్చేది. దేశంలోని శాంతి భద్రతలు, న్యాయ విచారణ, దేశ రక్షణ — చక్రవర్తి వశమందుండేవి. కాని చక్రవర్తి ఈ శాఖలకి అధికారి అయినప్పటికీ, నిరంకుశంగా క్రూరంగా వర్తించేవాడు కాడు. మంత్రుల సలహాలను అనుసరించే పాలించెడివాడు. వారిలో కొందరు "ఆంతరంగిక మంత్రులు" వుండేవారు. వీరితో చక్రవర్తి నిగూఢ రహస్యాలను సంప్రతించేవాడు. సుంకాలను పెంచే అధికారం చక్రవర్తి కుండేది.

ఆ కాలంలో మూడు రకాల సామంతులు శాతవాహనుల క్రింద ఉండేవారు. (1) "రాజులు":— వీరికి తమ పేర్లతో నాణెములను ముద్రించుకొనే అధికారం ఉండేది. (2) "మహా భోజులు": "మహా రథులు":— వీరిలో కొందరు చక్రవర్తికి వివాహ సంబంధమైన బాంధవులు. (3) "మహా సేనాపతులు":— వీరిలో కొందరు సరిహద్దు రాష్ట్రములకు అధికారులుగా ఉండేవారు. మరి కొందరు కొన్ని రకాలయిన ఇతర శాఖలకి అధికారులు.

పరిపాలనా సౌకర్యం కొరకు సామ్రాజ్యమంతా "ఆహారములు" అనే భాగాలుగా విభజితమై ఉండేది. ఒక్కొక్క

“ఆహారం” ఒక్కొక్క అమాత్యుని అధీనంలో ఉండేది. ఈ అమాత్యులకి వంశ పారంపర్యపు హక్కు లేదు. ప్రతి ఐదు సంవత్సరాలకీ వీరిని మారుస్తూండేవారు. ఒక్కొక్క ‘ఆహారం’ క్రింద కొన్ని గ్రామాలుండేవి. ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క అధికారి ఉండేవాడు. ఆ గ్రామాధికారి పేరు “గ్రామికుడు”. ఇంకా ఎన్నో రకాల ఉద్యోగులుండేవారు. సేనాధిపతులు, కంసాలులు, నాణెములు తయారు చేసేవారు. “మహామాత్రుల” ని పిలువబడే పాలనాధికారులు, రక్షకులు, ద్వారపాలకులు, గాయకారులు మొదలైనవారు.

## సాంఘిక పరిస్థితులు

సంఘములో చతుర్విధములైన వర్ణాలుండేవి. (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు). కాని వివిధ వృత్తులనుబట్టి ఉప వర్ణాలు కూడా ఏర్పడి ఉండేవి. “గోళికులు” “హాలికులు” మొదలయిన వారి విభంగా ఏర్పడినట్టివారు. గోళికులంటే పశుల కాపరులు, హాలికులంటే వ్యవసాయదారులు. ఈ వర్ణములవారే కాకుండా “శాక్యులు” “యవనులు” “పహ్లవులు” మొదలైన విదేశీయులు కూడా ఆ నాటి ఆంధ్ర సంఘంలో ఉండేవారు. ఈ అన్ని జాతుల సాంకర్యము సంఘములో ఉండేది. అమరావతిలోనూ, కృష్ణాలోయలోనూ, ఉన్న స్థూపాల నిర్మాణంలో గ్రీకుల పద్ధతి, రోమనుల పద్ధతి, సుస్పష్టంగా గోచరిస్తుంది. అల్లూరులో లభించిన ఒక శాసనములో “గ్రీకు దీపాలు” (“యవన దీపికలు”) పేర్కొనబడ్డాయి. కాబట్టి గ్రీకుల శిల్ప కళ ఆనాటి శిల్ప నిర్మాణానికి ఉద్దీపన నిచ్చి ఉంటుందని భావింపవచ్చు.

కుటుంబంలో స్త్రీలు ప్రముఖ పాత్ర వహించేవారు. ఆస్తిపై స్త్రీలకి కూడా పురుషులతో బాటు అధికారం ఉండేది. దాన శాసనములలో దాత పేరుతోపాటు అతని భార్య, కొడుకులు, కోడళ్లు, కూతుళ్లు, అల్లుళ్లు మొదలగువారి అందరి పేర్లుకూడా వ్రాయబడేవి. అందుచేత ఆ నాడు “సమిష్టి కుటుంబ పద్ధతి” ఉండేదని తెలుస్తోంది. చైత్య గృహాలను నెలకొల్పుటలో స్త్రీలు పురుషులకు విశేషంగా సహకరించేవారు. బౌద్ధ మతములకు భూములను దానం చేసిన శాతవాహన రాజు లెందరో ఉన్నారు.

అమరావతీ శిల్పములను బట్టి, పశ్చిమ గుహలలోని చిత్తరువులను బట్టి ఆనాటి ప్రజల వస్త్ర ధారణ, అలంకరణలు మొదలయిన విశేషములను తెలుసుకొనవచ్చును. పేదల గృహాలలో సైతము అలంకరణ అత్యంత శోభాయమానంగా ఉండేది. రంగు రంగుల కూజాలు, జాడీలు, రకరకాల కుర్చీలు, మంచాలు ఉండేవి

ప్రతి నగరం చుట్టును, ఎత్తయిన కోట గోడలు, పెద్ద పెద్ద సింహద్వారములు, కందకములు ఉండేవి. కోట గోడలు ఇటుకలతోను, మట్టితోను నిర్మించేవారు. ఆనాటి సైన్యంలో చతుర్విధ బలాలు ఉండేవి (రథ, గజ, తురగ, పదాతులు)

## వాణిజ్యము

ఆ కాలంలో తూర్పు దక్కనులో వర్తకం అమితంగా వృద్ధి పొందింది. “కంటకశిల” “కొడ్డూరు” వాణిజ్యానికి హృదయ స్థానాలుగా ఉండేవి. “చినగంజాము” నకు ఆగ్నేయ మూలగా ఉన్న “మోటుపల్లి” ప్రసిద్ధిగాంచిన రేవు పట్టణం. పశ్చిమ ప్రాంతములో “బారుకచ్చము”, (లేక “బ్రోచ్”), “సొపారా”, “కల్యాణ్” ముఖ్యమైన రేవులు. “పైఠాన్” “తగారా”, “గున్నూర్”, “నాసిక్”, “వైజయంతి”, “ధాన్యకటకము” — ఆనాటి ఆంధ్ర సామ్రాజ్యములో ప్రసిద్ధిగాంచిన వర్తక కేంద్రాలు ।।

ఒక్కొక్క రకమైన వర్తకానికి ఒక్కొక్క సంఘం (Guild) ఉండేది. ఆ సంఘానికి “సెట్టి” (Alder man) అనే పెద్ద ఒకడుండేవాడు. ఆ సంఘం సమావేశమయ్యే మందిరాన్ని “నిగమ సభ” అని పిలిచేవారు. ఆ నిగమసభ నేటి బ్యాంకులవలె పనిచేసేది. రెండవ శతాబ్దం చివరి భాగంలో తూర్పు దక్కనులో వాణిజ్యం మహోన్నత స్థితియందుండేది.

## మతము

క్రీ. పూ. మూడవ శతాబ్దిలోనే బౌద్ధమతము స్థాపింపబడి శాతవాహనుల కాలంలో అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చెందింది. “జల్లూరి” “గుమ్మడిదుర్రు” “ఘంటసాల” “భట్టిప్రోలు” “గుడివాడ” ‘గోలి’ — మొదలయిన ప్రదేశాలలోని స్తూపాలు అమరావతి శిల్పాలు, శిలా శాసనాలు,—ఆ కాలంలో బౌద్ధం ఎంత విశేషంగా వ్యాప్తమయినదో విశదీకరిస్తాయి. శాలివాహనులు చేసిన బౌద్ధమతాభివృద్ధిని ముక్తకంఠంతో చాటుతాయి. ఉత్తరాన “శాలిగుండం” మొదలుకొని దక్షిణాన “చినగంజాం” వరకున్నూ, పశ్చిమాన్ని “గుత్తి” మొదలుకొని తూర్పున “భట్టిప్రోలు” వరకున్నూ వ్యాపించిన విశాల ఆంధ్ర సామ్రాజ్యాన్ని, స్వార్థ త్యాగులయిన బౌద్ధ భిక్షుల పాద సరోజాలు పవిత్రం చేశాయి; ప్రజల మనః కుహరాలలోని అంధకారం తొలగిపోయింది. పామరులకు సైతం జ్ఞానోదయమయింది ।।

అమరావతీ స్తూపాలలో ఆనాటి ప్రార్థనా వస్తువులు మనకు గోచరిస్తాయి. కల్పవృక్షం, ఒక ఖాళీ సింహాసనం, దానికెదురుగా ఒక బల్లమీద తథాగతుని పవిత్ర పాదుకలు (త్రిశూల, ధర్మ చక్రాల గుర్తులతో), సుగతుని అస్థికలు, శిరస్సుపై సర్పఫణాలతో బుద్ధ భగవానుడు (నాగరాజు ?) మొదలగు శిల్పములనేకములున్నవి. వీనిని బట్టి ఆనాటి బౌద్ధమతంలో నాగ సంప్రదాయాలు బాగా ప్రబలి ఉన్నాయని తెలుస్తోంది. పశ్చిమ దక్కనులో కూడా "పిటలఖోర, కొల్హాపూర్" అనే ప్రాంతాల్లో బౌద్ధ శిల్పాలు లభించాయి. "సొపారా" అనే ప్రదేశంలో శ్రీ భగవాన్‌లాల్ ఇంద్రాజీ అనే ఆయన ఒక బౌద్ధ స్తూపాన్ని త్రవ్వితీశారు. ఇవన్నియు శాతవాహనుల కాలంలో బౌద్ధమతం అత్యున్నత స్థాయి నందుకున్నదని తెలుపుతున్నాయి.

ఈ బౌద్ధ శిల్పాలు, ఆరామాలు, నిర్మించడంలో కేవలం చక్రవర్తులే గాక, రాజోద్యోగులు, మహామంత్రులు, రాష్ట్రాధిపతులు, పెద్ద పెద్ద వర్తకులు, ఉన్నత కులాలలోని స్త్రీలు కూడా విరివిగా విరాళాలిచ్చి పోషించెడివారు.

ఆ కాలంలో వైదిక మతం కూడా అభివృద్ధి జెందింది. శాతవాహన రాజులలో మూడవవాడగు "శ్రీ శాతకర్ణి" యజ్ఞ యాగాదులగు వైదిక కర్మలనేకం చేసినట్లు తెలుస్తోంది. అతని కుమారులలో నొకనికి "వేదిశ్రీ" అనే పేరు కూడా పెట్టాడు ఈ వంశంలో 17 వ చక్రవర్తియగు "హాలుడు" రచించిన "గాథాసప్తశతి" (సంకలన గ్రంథము) పరమేశ్వరస్తుతితో ప్రారంభింపబడి, "గౌరీ" స్తుతితో సమాప్తమౌతుంది. శాతవాహనులలో 23 వ రాజగు గౌతమీపుత్ర శాతకర్ణి బ్రాహ్మణభక్తి తత్పరుడు, వైదిక మతాచార పరాయణుడు ఆనాటి ప్రజలు, ఇంద్రుడు, వాసుదేవుడు, సూర్యచంద్రులు, విష్ణుమూర్తి, కృష్ణుడు గణేశ్వరుడు పశుపతి మొదలగు దేవతల నారాధించేవారు.

ఈ విధంగా ఒక ప్రక్క బౌద్ధమతవ్యాప్తి, వేరొక ప్రక్క వైదికమతం అభివృద్ధిచెంది శాతవాహన సామ్రాజ్యం మతసహనానికి మార్గదర్శకంగా విలసిల్లింది॥

ప్రజలలో వ్యవసాయం ముఖ్య వృత్తిగా ఉండేది. గ్రామాలు, భూములు, బౌద్ధ విహారాలకు విరాళాలుగా ఇచ్చేవారు.

"నాగార్జున బోధి సత్వుడు" శాతవాహనుల కాలమునాటి వాడే॥ [క్రైస్తవమతమునకు మార్టిన్ లూథర్ ఎటువంటివాడో మహాయాన బౌద్ధమతమునకు నాగార్జును డట్టివాడు॥]

ఈ రీతిగా క్రీ. పూ. మూడవ శతాబ్దమునుండి క్రీ. శ. మూడవశతాబ్దమువరకు (క్రీ. పూ. 230–క్రీ. శ. 225) తెలుగు నేల నాలుగు చెరగుల శాతవాహన సంస్కృతి వ్యాపించి ఆంధ్రుల మహోన్నత్యాన్ని చాటి చెప్పింది॥ • • •

ప్రభుత్వ శాఖలన్నిటిలో విద్యా శాఖ కీలక మైనది. ఒక దేశం ఎంత పురోగమించిందో తెలుసు కోడానికి కొలబద్దగా అక్కడి విద్యాప్రమాణాన్ని తీసుకోవడం జరుగుతుంది

ఎంత చిన్న గ్రామమైనా పాఠశాల, సహకారసంఘం, పంచాయతీ ఉండాలని ప్రధాని నెహ్రూ పదే పదే చెబుతారు. ఆ విధంగా స్వాతంత్ర్యానంతరం విద్యాభివృద్ధికి ఎనలేని కృషి జరుగుతున్నది నిర్బంధ విద్యా కార్యక్రమాన్ని గత సంవత్సరం ప్రవేశ పెట్టి ప్రతి కుగ్రామంలో కూడ ప్రాథమిక పాఠశాలను నెలకొల్పు తున్నారు. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత, బహుళార్థక పాఠశాలలు. కళాశాలలు విరివిగా నెలకొల్ప బడుతున్నవి. అవసరం కొలదీ ఆయా గ్రామాలలోని పాఠశాలల్ని అప్‌గ్రేడ్ చేస్తున్నారు.

ప్రజాస్వామ్య వికేంద్రీకరణ కార్యక్రమం క్రింద పంచాయతీరాజ్‌ను ప్రవేశ పెట్టడంతో వయోజన విద్యా వ్యాప్తికి మరింత కృషిజరుగుతున్నది. ప్రతి పంచాయతీ సమితి బ్లాకులో ఒక స్త్రీ, ఒక పురుషుడు సాంఘిక విద్యా ప్రచారకులుగా పనిచేస్తున్నారు.

ఈ సంవత్సరం ( 1962–63 ) లో విద్యా శాఖకు 2,68,24,000 రూపాయిలు కేటాయించబడినవి. రాష్ట్రవిద్యా శాఖకు ఒక డైరక్టరు, నల్గురు డిప్యూటీ డైరక్టర్లు. నల్గురు అసిస్టెంటు డైరక్టర్లు స్టాటిస్టిక్స్, పాఠ్యగ్రంథాల జాతీయకరణ సంస్కృతం హిందీలకు ప్రత్యేకోద్యోగులుఉన్నారు. వీరుగాక ఐదుగురు ప్రాంతీయ డిప్యూటీ డైరక్టర్లు, 30 మంది జిల్లా విద్యాశాఖాధికార్లు (డి.ఇ.ఓ.) ఐదుగురు బాలికల పాఠశాలల ఇన్స్‌పెక్ట్రెస్‌లుకూడ ఉన్నారు. పాఠశాలల సంఖ్యను బట్టి విద్యావిషయిక జిల్లా ఉంటుంది, ఆ ప్రాతిపదికపై జిల్లా విద్యాశాఖాధికార్లుంటారు ఎక్కువ పాఠశాలలున్న జిల్లాకు ఒకరి కంటె ఎక్కువ మంది జిల్లా విద్యాశాఖాధికార్లుంటారు. గుంటూరు జిల్లాకు ముగ్గురు డి ఇ ఓ. లున్నారు. రాష్ట్రంలో గ్రంధాలయాలు, సాంఘిక విద్యా కార్యక్రమాల నిర్వహణకు కొత్తగా ఒక డిప్యూటీ డైరెక్టర్ నియమించబడినారు. విద్యాశాఖ డైరెక్టరే గ్రంధాలయాల ఎక్సు అఫీషియో డైరెక్టర్‌గా, ప్రభుత్వ పరీక్షల కమిషనర్‌గా కూడ వ్యవహరిస్తారు.



“ఉపయుభాను”

## ప్రాథమిక విద్య

ఏటా వెయ్యికి పైగా ప్రాథమిక పాఠశాలలు రాష్ట్రంలో నెలకొల్పబడుతున్నాయి. సక్రమంగా నిర్వహించబడని ఎయిడెడ్ పాఠశాలల్ని ప్రభుత్వం స్వాధీన పర్చుకొంటుంది. నెల్లూరు, విశాఖపట్నం, అనంతపురం, పశ్చిమ గోదావరి, కృష్ణా, చిత్తూరు జిల్లాలలో యీ విధంగా ఎయిడెడ్ పాఠశాలల్ని ప్రభుత్వం స్వాధీన పర్చుకొనే కార్యక్రమం ఒక పథకాన్ని అనుసరించి జరిగింది.

విద్యావంతులలో నిరుద్యోగాన్ని నిర్మూలించడానికి భారత ప్రభుత్వం ఒక పథకాన్ని రూపొందించింది. ఆ పథకం మేరకు ఏటా వెయ్యికి పైగా ఉపాధ్యాయులు గ్రామీణ ప్రాంతాలలో నియమించబడుతూ వచ్చారు.

గత సంవత్సరం రాష్ట్రంలో నిర్బంధోచిత ప్రాథమిక విద్యను ప్రవేశ పెట్టడంతో మరింత మంది ఉపాధ్యాయుల్ని నియమించడం అవసరమైంది. తృతీయ ప్రణాళికా కాలంలో యీ పథకం క్రింది మొత్తం 28.000 మంది ఉపాధ్యాయుల్ని కొత్తగా నియమించడానికి సంకల్పించబడింది, అందులో 3 300 మందిని గత సంవత్సరం ( 1961–62 ) నియమించారు. ఈ సంవత్సరం 3,500 మందిని

నియమిస్తున్నారు. నిర్బంధోచిత విద్యా పథకం క్రింద పాఠశాలకు వెళ్ళే పిల్లల సంఖ్య ఏటా పెరుగుతుంటుంది. అందువలన ఉపాధ్యాయుల సంఖ్యకూడ అదేవిధంగా పెరగాల్సి ఉంటుంది.

గత సంవత్సరం 6_7 సంవత్సరాల మధ్య వయస్సుగల పిల్లలకు నిర్బంధ విద్యా చట్టం అమలు జరపబడింది. ఈ ఏడు 7_8 సంవత్సరాల వారికి అది విస్తరించ బడుతున్నది. తృతీయ ప్రణాళికాంతానికి 6_11 సంవత్సరాల మధ్య వయస్సుగల వారంతా యీ చట్టం క్రిందికి వచ్చేటట్లు ప్రతి ఏడూ యీ వయస్సు హెచ్చించ బడుతుంది. ఇంతవరకూ పిల్లల తలితండ్రులకు నచ్చ చెప్పడంద్వారనే పిల్లల్ని పాఠశాలలకు రప్పించడం జరుగుతున్నది. తమ పిల్లల్ని పంపడానికి నిరాకరించిన తలితండ్రులపై పీనల్ చర్యలు గైకొనడానికి కూడ చట్టంలో అవకాశం ఉంది.

"యునిసెఫ్" "కేర్" అనే అంతర్జాతీయ సంస్థల సహాయంతో యీ సంవత్సరంనుండి పాఠశాల పిల్లలకు ఉచితంగా మధ్యాహ్న భోజనాన్ని యిచ్చే ఏర్పాటు రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో ప్రారంభమైంది. దీనివలన కూడ బీదలైన తలితండ్రులు తమ పిల్లల్ని పాఠశాలలకు పంపడం వలన కలిగే వ్యయప్రయాసాల్ని కొంతవరకూ తగ్గించుకోగలరు గనుక పంపడానికే పూనుకోవచ్చు.

## బేసిక్ విద్య

సామాన్య పాఠశాలల్ని క్రమేణా బేసిక్ పాఠశాలలుగా మార్చాలని లోగడ ప్రభుత్వం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు యిప్పటికే అనేక పాఠశాలలు అలా మార్చబడినవి. బేసిక్ శిక్షణ పాఠశాలలు ప్రత్యేకంగా పనిచేస్తున్నవి.

## శిక్షణ పాఠశాలలు, కళాశాలలు

తెలంగాణ ప్రాంతంలో శిక్షితులైన ఉపాధ్యాయుల కొరత మొదటినుండీ ఎదురవుతుంది. నిర్బంధోచిత విద్యా పథకాన్ని అమలు జరపడంతో ఆంధ్ర ప్రాంతానికికూడ అనేక మంది ఉపాధ్యాయులు అవసరమౌతున్నారు. ఈ డిమాండ్‌ను ఎదుర్కో-డానికి ప్రతి ఏటా ఉన్న ట్రెయినింగ్ పాఠశాలలు, కళాశాలలలో సీట్లు హెచ్చించడం జరుగుతున్నది. ఈ సంవత్సరం భవనాలు అందు బాటులో ఉండడాన్నిబట్టి కొత్తగా అనేక సెక్షన్లను తెరవాలనీ, శ్రీకాకుళం, విశాఖపట్నం, రాయలసీమ జిల్లాలలో కొత్తగా ట్రెయినింగ్ పాఠశాలల్ని నెలకొల్పాలనీ ప్రభుత్వం సంకల్పిస్తున్నది.

పట్టభద్రులైన ఉపాధ్యాయులకు డిప్లొమా, మెట్రిక్యులేట్లకు సర్టిఫికెట్ యిచ్చే ఫిజికల్ ట్రెయినింగ్ కళాశాల హైద్రాబాద్‌లో నెలకొల్పబడింది. వరంగల్‌లో ఉన్న ప్రభుత్వ శిక్షణ కళాశాలలో సీట్లు రెట్టింపుచేయబడినవి. రాజమండ్రిలోని ప్రభుత్వ శిక్షణ కళాశాలలో ఎం. ఎడ్. విద్యార్థులకు స్కాలర్‌షిప్పు లిచ్చే కార్యక్రమాన్ని ప్రభుత్వం మంజూరి చేసింది.

## అధ్యాపకుల జీతాలు

ఇటీవల ప్రభుత్వం పే కమిటీ సిఫార్సుల్ని అమలు జరపడంలోనూ యితరత్రానూ ఉపాధ్యాయుల జీతాల్ని మెరుగు పర్చింది. కరువు భత్యంకూడ హెచ్చించబడింది. గత సంవత్సరమే విశ్వవిద్యాలయాల గ్రాంట్సు కమీషన్ నిర్దేశించిన వేతనాలు కళాశాలలలోని అధ్యాపకులకు వర్తింపజేయడం జరిగింది.

## కళాశాలలు

ఆ మధ్య మూడేండ్ల డిగ్రీ కోర్సుల్ని కళాశాలన్నిటిలో ప్రవేశ పెట్టడం జరిగింది. ఈ సందర్భంలో సక్రమంగా నిర్వహించబడని ఎయిడెడ్ కళాశాలల్ని ప్రభుత్వం స్వాధీనపర్చుకొన్నది. ఈ కార్యక్రమం క్రింద ఒక్క గద్వాల కళాశాల మినహా తెలంగాణలోని అన్ని కళాశాలల్నీ ప్రభుత్వం తీసుకొన్నది.

చిత్తూరులో గత సంవత్సరం కళాశాలను నెలకొల్పడంతో ఆంధ్ర ప్రాంతంలో ప్రతి జిల్లా కేంద్రంలో కళాశాలు ఉన్నాయింకా తెలంగాణలో సంగారెడ్డి (మెదక్), ఆదిలాబాద్, మహబూబ్‌నగరంలలో ఆర్ట్సు కళాశాలలు నెలకొల్పబడలేదు. మెదక్ జిల్లాలో సిద్దిపేట, మహబూబ్‌నగరం జిల్లాలో గద్వాలలో కళాశాలలుండగా ఆదిలాబాద్ ఆంధ్ర ప్రదేశ్‌లో కళాశాలలేని జిల్లాగా మిగిలి పోయింది.

## స్త్రీ విద్య

అన్ని కళాశాలలో స్త్రీలు చేరుతున్నా, మరింత ఎక్కువ మంది స్త్రీలు కళాశాల విద్య నభ్యసించడానికి వీలుగా వారికి రాష్ట్రమంతటా విరివిగా ప్రత్యేక కళాశాలలు నెలకొల్పబడుతున్నాయి. కర్నూలు, విశాఖ పట్నంలలో స్త్రీల కళాశాలల్ని నెలకొల్పటమే గాక యిటీవల విజయవాడలో మరో కళాశాలకు శంకు స్థాపన జరిగింది. ఇంకా కాకినాడ, నెల్లూరులాటి అనేక ప్రదేశాలలో స్త్రీలకు ప్రత్యేకంగా కళాశాలల్ని నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

వయోజన మహిళా విద్యావ్యాప్తికి భారత ప్రభుత్వం రూపొందించిన పథకం క్రింద బాల్యంలో చదువును విరమించు కొన్న స్త్రీల కొరకు రాష్ట్రంలో ఆరు పాఠశాలలు పనిచేస్తున్నవి. హైద్రాబాద్, వరంగల్, పులివెందల, గుత్తి, పిట్లవారిపాలెం, గన్నవరంలోని యీ పాఠశాలలు స్త్రీలకు సాధారణ విద్య ఉపాధ్యాయ శిక్షణ సౌకర్యాల్ని కల్పిస్తున్నవి. నిరుద్యోగులైన స్త్రీలు—ముఖ్యంగా విధవలు, నిరాశ్రయులకు—యివి ఉద్దేశించ బడినాయి.

## వికలాంగులకు విద్య

గ్రుడ్డి, చెవిటి విద్యార్థులుకూడ చదువుకొనడానికి వీలు కల్పించే నిమిత్తం హైద్రాబాద్ మలక్‌పేట, కాకినాడ, కడపలలో ప్రత్యేక పాఠశాలలు పనిచేస్తున్నాయి. ఈ పాఠశాలలలో అంధులకు, చెవిటివారికి పాఠాలు బోధించే ప్రత్యేక పద్ధతులు ఉంటాయి ఈ పాఠశాలలకు చెందినవారుకూడ కొందరు క్రమేణాపట్టభద్రులవు తున్నారు.

## అనాథాశ్రయాలు

అనాథ బాల బాలికలకు భోజన వసతుల్ని కల్పించి విద్యను బోధించే సంస్థలు రాష్ట్రంలో 120 కు పైగా ఉన్నాయి. ఏజన్సీ ప్రాంతాలలో కొత్తగా యిలాంటి పాఠశాలల్ని తెరిచారు హైద్రాబాద్ సరూర్‌నగర్‌లో ఉన్న విక్టోరియాహోం యిలాంటి పాఠశాలలన్నిటిలో పెద్దది. ఇందులో చాలవరకూ ప్రయివేటు వ్యక్తులు, సంస్థల నిర్వహణలో ఉన్నా ప్రభుత్వం విరివిగా ఆర్థిక సహాయం చేస్తున్నది.

## వయోజన విద్య

వయోజనులలో నిరక్షరాస్యతను నిర్మూలించి, వయోజను లకు సామాన్యంగా ఉండే విజ్ఞానానికి మెరుగు పెట్టానికి ఉద్దే శించిన ఒక పథకం క్రింద వయోజన విద్యా కేంద్రాలు, గ్రంథాలయాలు, ఫిల్మ ప్రదర్శనలద్వారా ప్రయత్నాలు జరుగు తున్నవి. ఇలాంటి వయోజన విద్యకు వీలుగా రాష్ట్రంలో పటమట, జడిచర్లల్లో రెండు శిక్షణ పాఠశాలలు పనిచేస్తున్నవి. రాష్ట్రమంతటా రెండు వేల వరకూ వయోజన విద్యాకేంద్రాలు పనిచేస్తున్నవి.

## విద్యా సంఘాలు

ప్రతి ప్రాంతీయ విద్యాశాఖాధికారి రేంజిలో ప్రాథమిక ఉపాధ్యాయుల సంఘాలు ఏర్పడి మొత్తం ఉపాధ్యాయులందర్నీ సమీకరించడం జరుగుతున్నది. అందరూ యీ సంఘాలలో సభ్యులుగా చేరి తీరాలి. విద్యాశాఖ డైరెక్టర్ పంపిన ఉత్తర్వులు తమకు పంపబడినప్పుడు వాటిపై అభిప్రాయాన్ని వెలిబుచ్చే అవకాశం యీ సంఘాలకు ఉంటుంది అయితే వారు రాజకీ యాంశాల్ని చర్చించకూడదు

ఇవిగాక రాష్ట్రస్థాయిలో ప్రభుత్వోపాధ్యాయులకు బలమైన సంఘం ఉంది. ఉపాధ్యాయుల సమస్యల్ని వారు ప్రభుత్వ దృష్టికి తెస్తుంటారు. రాష్ట్ర శాసన మండలిలో ఉపాధ్యాయ ప్రతినిధులు ఉంటారు. వారు శాసన రంగంలో ఉపాధ్యాయుల వాణిని వినిపిస్తుంటారు.

## గ్రంథాలయాలు

గ్రంథాలయాలకు ఒక డిప్యూటీ డైరక్టర్ ఆధీనంలో విద్యా శాఖలో ఒక ప్రత్యేక విభాగాన్ని నెలకొల్పారు. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంలో పిల్లల విభాగాన్ని నెలకొల్పారు. జిల్లా గ్రంథా లయాలు, బ్రాంచి గ్రంథాలయాలు కూడ క్రమేణా అభివృద్ధి పరచ బడుతున్నవి

## హిందీ వ్యాప్తి

జాతీయ భాష హిందీ వ్యాప్తికి విద్యాశాఖ ఎంతో కృషి చేస్తున్నది. ప్రభుత్వ కళాశాలల గంథాలయాలకు హిందీ గ్రంథాల్ని కొనడం, అనేక చోట్ల హిందీ గోష్ఠుల్ని నిర్వహించడం రాష్ట్ర, జిల్లా, స్థాయిలలో హిందీలో కళాశాల, పాఠశాల విద్యార్థులకు వ్యక్తృత్వం పోటీల్ని జరపడం. ఓరియంటల్ కళాశాలలో చదివే హిందీ విద్యార్థులకు స్కాలర్ షిప్పు లివ్వడం జరుగుతున్నది. 44 హిందీ ప్రేమీ మండలిలను దక్షిణభారత హిందీ ప్రచారసభ నిర్వహిస్తున్నది. హిందీ బోధన జరుగుతున్న రాజమండ్రిలోని ఆంధ్ర మహిళా సంస్థ యింకా అనేక హిందీ విద్యాలయాలకు ప్రభుత్వం ధన సహాయం చేస్తున్నది. అలాగే యితర ఓరియంటల్ పాఠశాలకు సహాయం చేస్తున్నది

## పాఠ్యగ్రంథాల జాతీయకరణ

మొత్తం పాఠశాలలలో ఉపయోగించే అన్నిరకాల పాఠ్య గ్రంథాల్నీ ప్రభుత్వము ప్రచురించాలనే విధానం క్రమేణా అమలు పరచబడుతున్నది. పాఠ్య గ్రంథాల ముద్రణకు ప్రత్యేకంగా ఒక

ముద్రణాలయాన్ని 1958 జనవరిలో నెలకొల్పారు. క్రమేణ ఆ ముద్రణాలయం కూడ అభివృద్ధి పరచబడుతున్నది.

ప్రభుత్వ పరీక్షలు:

హెచ్.ఎస్.సి; హెచ్.ఎస్.సి; (మల్టిపర్పస్) ఎస్. ఎస్. ఎల్.సి. పరీక్షలే గాక 8వ తరగతి పబ్లిక్ పరీక్షలు, సంస్కృత పరీక్షలు, గ్రామ వైద్యులపరీక్షలు, అకౌంట్ టెస్టులు. ఉపాధ్యాయ శిక్షణ పరీక్షలు వంటివి ఎన్నో విద్యా శాఖచే నిర్వహించబడు తున్నవి.

ప్రధానోపాధ్యాయులకు బేసిక్ విద్యకు అనేక గోష్ఠులు తరచు ఏర్పాటు చేయబడుతున్నాయి. అదే విధంగా విద్యార్థులలో ఎన్.సి.సి. ఎ.సి.సి. బాలుర స్కౌట్, బాలికల గైడ్ ఉద్యమాలు, జూనియర్ రెడ్ క్రాస్ లాటి కార్యక్రమాలు ఏటా విస్తృత పరచ బడుతున్నవి. దృశ్య శ్రవణ విద్యకు గాను అనేక పాఠశాలలకు రేడియో సెట్లు, టేప్ రికార్డర్లు, ఫిల్ములు యివ్వబడు తున్నవి.

వీటన్నిటితోబాటు రాష్ట్రంలో పనిచేస్తున్న సాహిత్యఅకాడమీ, సంగీత నాటక అకాడమీ. లలిత కళా అకాడమీలకు ఏటా బ్లాకు గ్రాంటు లిచ్చి ఆ సంస్థలు సాహిత్య. సంగీత నృత్య, నాటక, శిల్ప కళా, చిత్రలేఖన రంగాలలో విరివిగా కృషి చేయడానికి, కళాకారులకు ఆర్థిక సహాయం చేయడానికి విద్యాశాఖ దోహదం చేస్తున్నది

దేశంలోని ప్రతి వ్యక్తి అక్షరాస్యుడైనప్పుడే సోషలిష్టు సమాజ ధ్యేయంతో పురోగమిస్తున్న ప్రజాస్వామ్య వ్యవస్థ రాణిస్తుంది.

## పాఠకులకు ఒక విజ్ఞప్తి

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ముఖ్యంగా రాష్ట్ర కార్యకలాపాలను, నేడు సాగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను ప్రచారం చేయడానికి ఏర్పడినప్పటికీ, నాలుగు భాషలలో వెలువడుతున్న ఈ పత్రికలో కొంత భాగాన్ని కథలు, పద్యాలు, సాంస్కృతిక, సాహిత్య వ్యాసాలకు కూడా కేటాయించడం జరుగుతున్నది. దీనికి తోడు ప్రతిసారీ చిత్ర విభాగం కూడా వుంటున్నది. ఈ పత్రిక పఠనా విలువలను పెంచడానికి పాఠకులనుంచి సలహాలు సూచనలు ఆహ్వానించ బడుతున్నవి.

జిల్లా ప్రాంతాలలో ఈ పత్రిక చందా ఉద్యమం ఒకటి సాగుతున్నది. ఈ సందర్భంగా జిల్లా ప్రజా సంబంధాల అధికారులు తమ వద్ద ఉన్న ఈ పత్రిక ప్రతులతో ప్రజలతో సంప్రదిస్తున్నారు.

డైరెక్టర్
సమాచార ప్రజా సంబంధాల శాఖ
హైదరాబాద్

# సౌందర్యలహరి

డాక్టర్ బూర్గుల రామకృష్ణరావు

(గత సంచిక తరువాయి)

చనుఁబాలై ప్రవహించెఁ బాల్కడలియే సారస్వతమ్మై జగ
జ్జననీ! నీ హృదయాన నంచుఁదలతున్ సత్యమ్మ! ఆపాలు నిం
చిన వాత్సల్యముతోడ నీవొసగగా సేవించికా, ప్రౌఢులం
దున నెల్లన్ ద్రవిడార్భకుండు సుకవీంద్రుండౌచు రాణించుటల్

హరకోపజ్వలనావలీఢమగు మేనై మన్మథుండో దయా
పరిధీ! నీదుగభీరనాభిసరసిన్ వ్రాలంగ నాభర్జిత
స్మరదేహాన నవెళ్ళుధూమలతికా జాలమ్ము నూఁగారటం
దురు లోకుల్. హిమశైలరాజ తనయా! స్తోత్రైక లీలాప్రియా!

జననీ! యామున సూక్ష్మవీచికలతో సారూప్యముంబొందు త్వ
త్తను మధ్యాంచిత రోమరాజిఁగనునంతన్ దెల్వితోఁ జూడ, నీ
చనులన్యోన్య విమర్ద నంబెనయగన్ స్థానంబులేకున్కియా
స్తనమధ్యాభ్రము జారినాభిగుహలో దాగున్నటుల్ దోఁచెడిన్

ససినిలుపొందుగంగసుడి, చారుపయోధరకుట్మలమ్ము లిం
పెసగెడి రోమరాజిలత కిమ్మగు నీ నతనాభి పాదగున్
కుసుమశరప్రతాప శిఖికుండమహో! రతికేళికాగృహ,
మ్మ, సమశరారిచూడ్కుల గుహాముఖమాత్మ సమాధిసిద్ధికిన్

కౌనసలేకృశించినది. గాఢకు చద్వయభారసంగతిన్
మ్లానతనొందెవంగి, యనుమానమగున్ సగమౌనా యంచు నెం
తేని; క్షరన్నదీతటతత మహీరుహ మట్టియవస్థకున్ వశ
మ్మైనది, శైలరాజతనయా! చిరభద్రములౌత దానికిన్

ఎప్పటికప్పుడంబ! చెమరించుచుఁ గంగులు దీఱురైకలో
నొప్పుచుఁ జంకలందొరయుచున్న భవత్కుచ హేమకుంభముల్
చొప్పడఁ జేయగ౯ మరుడుసొంపుగ నాలవలీల తాలిచే
నొప్పబిగించెనన్నటుల నుల్లసిలున్ ద్రివలిన్ వలగ్నమున్

అరణమొసంగినాఁ డటే హిమాలయుఁ డాత్మనితంబసీమ వి
స్తరతయు గౌరవమ్ము హిమశైలజ! నీకదికాదె హేతువ
మ్మరో! విపులావనింబెరసి మాటికిఁ జుల్కన చేయునిమ్మహా
ధరణితలమ్ము నీదగుని తంబము? భక్తహృదబ్జవాసినీ

కరిరాట్తుండములన్ సువర్ణ కదళీకాండమ్ముల౯ రెంటినినిన్
వరసౌందర్యమునన్ జయింపగఁదొడల్; భర్తృప్రణామమ్ముశా
ప్రురతిన్జేయ సువృత్తముల్ ధృఢములై రాజిల్లు నీజానువుల్
గిరిజా! దిగ్గజకుంభయుగ్మముల సత్కీర్తిన్ వినిర్జించెడిన్

గిరిసుత! మన్మథుండు హరుగెల్చెడి పూనికగాఁ బదింటిన్
శరములనుంప నీ దువరజంఘలె తూణములంబొనర్చెగా!
సురమకుటాగ్రశాణముల సొంపుగమేల్పదనెక్కి శ్రీనఖ
స్ఫురణనెసంగు నయ్యలుగు ముల్కులనున్పది, వానికిన్దుద౯

శ్రుతిశీర్షమ్ములు తాల్చువేనిని సదాశుభ్రావతం సమ్ముగా,
సతమెవ్వానికి పాద్యమో శివజటా సంసర్గయౌగంగ, శ్రీ
పతిచూడామణికాంతులెచ్చటగునో పారాణిరేకల్, దయా
మతి! నీయట్టి పదమ్ములుంచగదవమ్మా! నాదుశీర్షమ్మునన్

దేనందన్నినఁ జాలునంచు మదినెంతే ముచ్చటంజెందును
ద్యానంబందలి యయ్యశోకమున నీర్ష్యాభావముంజూనునీ
శానుం, దానయనాభిరామమును లాక్షారాగ సౌందర్య సం
ధానమ్మౌ భవదంఘ్రియుగ్మమున కుందల్లీ! నమోవాకముల్

వెడవెడఁబిల్చినిన్ సవతిపేరున వెల్వెలఁబోయియంతలో
నడుగుల వ్రాలు శంభునిటలాగ్రము తాచిన నీపదాబ్జ, మ
య్యెడనిట లాగ్నిబడ్డయిడు మెల్లను నేటికిఁ దీరెనంచనం
గుడునగు, నీదునందియల గోమగుమ్రోఁతల గల్లుగల్లనన్

మంచునవాడు, నెప్పుడును మంచుమలన్ దిరుగాడనేర్చు, ని
ద్రించునురేల, నుల్లసిలు రేలను రేపకడన్, నివాసమౌ
నెంచగలచ్చికిన్, సిరులనీగలవాశ్రిత కోటికెల్ల; ని
ర్జించుట చిత్రమేమిసరసీరుహమున్ శివ! నీదు పాదముల్

పదమగుకీర్తిసంపదకుఁ ద్వత్ప్రపద, మ్మపదమ్ముతల్లి! యా
పదలకు; నెట్లుసత్కవులు పల్కిరొనిష్ఠురకూర్మపృష్ఠమ
య్యది సరియంచుదానికి? దయాలువుశంభుడుకేలఁ బట్టిబల్
మృదులము దానిసన్నెకలు మెట్టనొనర్చుటదెట్లొ, పెండిలిన్

బీదలకెల్ల సంపదలవేడిన తక్షణమేయొసంగు త్వ
త్పాదయుగంబు దేవవనితాకర పద్మనిమీల నేందుబిం
బోదయమౌ భవన్నఖమయూఖరుచిన్ హసియించు, స్వర్ద్రుమ
శ్రీదెసస్వస్థలంజిగురుచేతుల నిండుఫలమ్ము లిచ్చుచోన్

దీనులకున్ సిరుల్ దనివిదీరగఁ గోరికయెట్టులట్లుగా
నీనుచు, మేటియందమనునింపగు తేనియఁజిల్కరించునీ
మానితపారిజాత సుమంజరియన్ చరణద్వయమ్ముపై
పైనొకషట్పదమ్మనయి వ్రాలెదగాక షడింద్రియాత్మతన్

పదవిన్యాస విలాసమంతయును నేర్వన్ రాజహంసల్ భవ
త్పదముల్ వీడవు, తొట్రుపాటెడనెడన్ బ్రాపించినన్ వానికొ
ప్పిదమౌ బాతము సెప్పనోయనగ, దేవీ! చారుచారిత్ర! త్వ
త్పదముల్ వొల్చును రత్ననూపుర ఝణత్కారమ్ముదారమ్ముగన్

పరగన్ మంచపుకోడులై శిశువులై బ్రహ్మేశరుద్రాచ్యుతుల్,
పరమాచ్ఛద్యుతియన్ మిషన్ శివుఁడు నీపైదుప్పటైయొప్పినీ
యరుణశ్రీ ప్రతిబింబితమ్మగుట తానారుణ్యముంజెందియ
ద్దిర! శృంగారమురూపు కట్టినటులెంతేనించునా నందమున్

కురులనరాళమై, సహజ కోమలమై చిరునవ్వుసొంపులన్,
సరళహృదిన్ శిరీషమయి, చన్గవశోభల సన్నెకల్లునై,
గురుతరమైనితంబముల గుబ్బల, బల్ కృశియించికౌనునన్,
హరుకరుణారుణ ప్రభలయంద మొకండు జగమ్ము బ్రోచెడిన్

తనరన్ గస్తురియైకలంకము, కదల్ దైవార కర్పూర శో
భను, నైశాకరబింబదంబరమునున్ బన్నీరుగా బ్రహ్మనిం
చును, నీదౌనను భోగసంపదలచే శూన్యమ్ముగాగా, సుహా
సిని! నీకై ప్రతిరోజునున్ మరకత శ్రీపేటికన్ మాటికిన్

హరుశుద్ధాంతమవైననీ పదములన్నర్చించు మర్యాదలన్
సరిగా నేర్తురెయెవ్వరేని మనముల్ చాంచల్య మొందంగ? నా
సురనాథాద్యమరుల్ భవద్గృహ బహిస్థాణంబులన్ గాపుకా
వరసిద్ధుల్ అణిమాదికంబులమరన్, వాంఛింపరన్యంబులన్

ఎందఱు వాణిఁ గొల్చి విలసింపరు సత్కవులై? మఱెందర
య్యిందిరఁ గొల్చి మేల్సిరుల కీశులు గారు? సతీశిరోమణీ!
ఇందుకిరీటు నొక్క నిత్యజించి భవత్కుచకుంభ సంగతిన్
బొందగ గోరటమ్మునకున్ వశమౌనె? గిరీంద్రనందనా!

పరమమహేశ్వరీ! నిగమపారగులెల్ల వచింత్రు వాణివిన్
సరసిజగర్భురాణివని, శంభుని పత్నివి యద్రిజాతవున్
హరిసతి లచ్చివంచును: మహామహిమాఢ్యతురీయవైననీ
వరయగరానిమాయవు, ననంతముగా భ్రమియింతు విశ్వమున్

భవదాలక్తరసార్ద్రపాదయుగళ ప్రాగ్ధౌత తీర్థమ్మునున్
జవులూరంగను గ్రోలి విద్యలను నే సాధించుటెన్నండొకో?
కవితాహేతువు జన్మమూకలకహో! కల్యాణి! వాణీముఖో
ద్భవతాంబూలరసత్వమెప్పుడది సంపాదించునో, తెల్పవే

సిరితోడన్ హరితోడి పెండ్లికొడుకై శ్రీవాణితో బ్రహ్మతో
సరివాడై విహరించుపో, రతిమనస్థైర్యమ్ము సళ్ళించు సుం
దరమూర్తిన్, పశుపాశముల్ దునుముత్వద్భక్తిన్, చిరంజీవియై
పరమానందము చూరలాడు, జననీ! భక్తుండదెల్లప్పుడున్

దినమణికిన్ నివాళియని దీపశిఖావలయమ్ము జూపుటల్,
ఒనరగచల్వరాతి జలమూని సుధాకరు కర్ఘ్యమిచ్చుటల్
వననిధికందులోని సలిలమ్ములఁ దర్పణమాచరించుటల్,
జననిరో! నీవొసంగిన వచస్తతిచే నినుఁ బ్రస్తుతించుటల్

(సమాప్తము)

# పశ్చిమ గోదావరికి క్రొత్త పరిశ్రమలు

పశ్చిమ గోదావరి జిల్లాలో చిన్నరకం పరిశ్రమల అభివృద్ధికి తీవ్రమైన ఉద్యమం ఒకటి ఏలూరులో 6-5-62 న ఆరంభించబడింది. ఈ జిల్లాలో తీవ్ర వ్యవసాయాభివృద్ధికి ఉద్దేశించబడిన 'ప్యాకేజ్ పధకం' యిదివరకే అమలు జరుగుతున్నది. ఈ ఉద్యమ సమయంలో, హైదరాబాదులోని చిన్నరకం పరిశ్రమల సర్వీసు సంస్థయొక్క సంచార వర్కుషాపులు ప్రదర్శనలిచ్చి, జిల్లా వివిధ ప్రదేశాలలోని వృత్తి పనివారికి శిక్షణనిచ్చినవి.

జిల్లాలోవున్న చిన్నరకం పరిశ్రమలను విస్తృతపరచుటకు, క్రొత్తపరిశ్రమల స్థాపనకు గల అవకాశాలను కనుగొనుటకై యీ సంస్థ ప్రాధమిక చర్యగా అక్కడ పరిశీలన జరిపింది.

1961 ఆగస్టు సెప్టెంబరులో జరిపిన పరిశీలన పారిశ్రామిక వాతావరణం, అందుబాటులోవున్న వనరులు ఆప్రాంతంలోగల చిన్నరకం కుటీర పరిశ్రమల స్థితిగతులను గురించి తెలుసుకోడానికై ఉద్దేశించబడింది. ఇందులో అధికార వర్గాలు, మార్కెట్టులు, విషయజ్ఞులైన వ్యక్తులనుంచి సేకరించిన సమాచారం వివరాలు కూడ వున్నవి. ఇట్టి సమాచారం ముఖ్యంగా, వాడకం వనరుల ప్రాతిపదికపై క్రొత్త స్థాపనకుగల అవకాశాలను తెలుసుకొనుటకై సేకరించబడినవి.

ఈ పరిశీలనలో, హైద్రాబాదు, ఏలూరు, కొవ్వూరు, నిడదవోలులలోగల కార్యాలయాలనుంచి జిల్లాలలో గల వనరులు, సౌకర్యాలకు సంబంధించిన నేపధ్య వివరాలు సేకరించబడినవి. నిర్ణీతమైన చిన్నరకం పరిశ్రమలను పరిశీలించి వాటి సమస్యలను వాటి విస్తరణకు గల అవకాశాలను తెలుసుకొనడం జరిగింది ఏలూరు, కొవ్వూరు, తణుకులలో పెద్దరకం యూనిట్లు అభివృద్ధి అవకాశాలను తెలుసుకోడానికి వాటిని కూడా దర్శించడం జరిగింది. వివిధ వినిమయ వస్తువుల వాడకం మున్నగు వివరాలను తెలుసుకోడానికి జిల్లా నిర్ణీత కేంద్రాలలో గల ముఖ్య వ్యాపారులతో సంప్రదించారు.

అంతేకాక, యీ ప్రాంతంలో క్రొత్త పరిశ్రమల స్థాపనకు గల అవకాశాలను తెలుసుకోడానికి కొన్ని అసోసియేషన్లు పరిశ్రమ వాణిజ్యాలలో విషయజ్ఞులైన స్థానికులు, కాటోయే పారిశ్రామికులతో సంప్రదించారు.

ఫీల్డు పరిశోధన సమయంలో మొత్తం 4 పెద్దరకం యూనిట్లు, 98 చిన్నరకం యూనిట్లు, 110 మంది వ్యాపారులు, 2 అసోసియేషన్లతో సంప్రదింపులు జరిగాయి.

పశ్చిమగోదావరి విస్తీర్ణం 3015 చ. మైళ్లు. ఇది మొత్తం ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణంలో దాదాపు 2.9 శాతం. ఈ జిల్లా ముఖ్య పట్టణం ఏలూరు, నర్సాపురం ఒక చిన్న రేవు పట్టణం

1961 జనాభా లెక్కల ప్రకారం యీ జిల్లా జనాభా 19.78 లక్షలు (తాత్కాలిక అంచనాలు) 1951 జనాభా లెక్కల ప్రకారం దగ్గరగా 73.3 శాతం ప్రజలు వ్యవసాయం వృత్తిగా గలవారు. వ్యవసాయేతరమైన ఉత్పత్తి—ఇందులో కుటీర, చిన్నరకం, పెద్దతరగతి పరిశ్రమలలో వృత్తులవేరి వున్నవి—మీద కేవలం 8.8 శాతం ప్రజలు మాత్రమే ఆధార పడతారు.

## వ్యవసాయ వనరులు

పశ్చిమ గోదావరిజిల్లా రాష్ట్రంలో సౌభాగ్యవంతమైన వ్యవసాయ జిల్లాలలో ఒకటిగా పరిగణించబడుతుంది. ఈ జిల్లా బియ్యాన్ని పండిస్తుంది. ఆ విషయంలో మిగులు ప్రదేశమైనందున అది దక్షిణ రాష్ట్రాల అవసరాలను తీరుస్తుంది. చెఱకు యిక్కడ పండే ముఖ్య వాణిజ్య పంట. వేరుసెనగ ప్రధానమైన నూనె పంట. మిగిలిన పంటలలో నువ్వులు, మినుములు, పెసలు, కందులు, పొగాకు పండుతాయి ఫలజాతిలో మామిడి, నిమ్మ అరటిపళ్లు ప్రధానమైనవి. గడ్డి, పీచు, ఫలాలు, చెఱకు

మున్నగువాటిని ప్రారంభించే పరిశ్రమలకు ముడి పదార్థాలుగా వాడవచ్చు.

## అరణ్యాలు

అరణ్యాల విస్తీర్ణం 1,97,215 ఎకరాలు. టేకు, వెదురు మున్నగునవి ముఖ్యమైన అటవీ వస్తువులు. కలప అంత నాణ్యమైనది కాదుట. ప్రస్తుతం వున్న వడ్రంగం, కొయ్య సామాను యూనిట్లకు టేకు ముడి పదార్థంగా పనికి వస్తుంది. ఇక్కడి కలపలో రమారమి సగం చోట్ల రాజమండ్రిలో మార్కెటుకి పంపబడుతుంది. దాదాపు 60 శాతం వెదుళ్లు స్థానికంగా వినియోగించబడతవి. మిగిలిన వాటిని రాజమండ్రిలోని ఆంధ్ర కాగితం మిల్లు కాగితం తయారీకై వినియోగిస్తుంది. ఇక్కడ దొరికే బీడీ ఆకులలో 20 శాతాన్ని స్థానిక బీడీ ఫ్యాక్టరీలు వాడు కుంటాయి. మిగిలినవి బీడీల తయారీకై మద్రాసుకి యెగుమతి చేయబడతవి. పదును పెట్టటానికి వుపయోగించే బెరడునంతను స్థానిక తోలు పదును కర్మాగారాలు వాడుకుంటవి. ఉంకుళ్లు, అడ్డాకులు స్థానికంగా వాడుకొనబడతవి

## పశుగణాలు

1956 లో యీ జిల్లా లోని పశువుల సంఖ్య దాదాపు 10.76 లక్షలు. ముడి ఆవు చర్మాలు మొదలైన వాటిలో దాదాపు 70-80 శాతాన్ని స్థానిక తోలు పదును కర్మాగారాలు వినియోగించుకుంటవి. మిగిలినవి మద్రాసుకు యెగుమతి చేయబడతవి. ముడి మేక, గొఱ్ఱె తోళ్లు పూర్తిగా మద్రాసుకు పంపబడతవి. స్థానిక తోలు పదును కర్మాగారాలలో లభించే చర్మపు రద్దుతో జిగురు తయారుచేయవచ్చు. దాదాపు జిల్లాలో సేకరించిన యెముకలన్నీ యెముకల పొడి తయారీకై మంగళగిరి, సామర్లకోట, పెంటపాడు మిల్లులకు యెగుమతి చేయబడతవి ఉన్నిలో 80 శాతం ఏలూరులో తివాచీల నేతకు, స్థానికంగా కంబళ్ల తయారీకి వాడుకొన బడుతుంది. ఈ జిల్లాలో ఏలూరు, తాడేపల్లిగూడెము బాతుగ్రుడ్ల వుత్పత్తికి ముఖ్య కేంద్రాలు. ఏటా రూ. 22 లక్షల విలువగల బాతుగ్రుడ్లు వుత్పత్తి చేయబడతవి. వీటిలో రమారమి 80 శాతం కలకత్తాకు, మిగిలినవి బొంబాయి, ఢిల్లీలకు యెగుమతి చేయబడతవి

## మత్స్య సంపద

మత్స్య సంపద అభివృద్ధికి యీ జిల్లాలో విస్తారమైన వనరులున్నవి. కోస్తా ప్రాంతం నిడివి దాదాపు 10 మైళ్లు. కొల్లేరు, ఉప్పుటేరు ప్రాంతాలలో పెద్ద కొయ్యచేపలు విస్తారంగా దొరుకుతవి.

## ఖనిజాలు

ఈ జిల్లాలో సున్నపురాళ్లు, అభ్రకం, నల్లసీసం, ముడి యినుము, బంక మట్టిలు, శిలా స్ఫటికాలు మున్నగునవి లభిస్తవిట. చక్కని నల్ల సీసం వనరులు వున్నందున యీ ప్రాంతానికి నల్ల సీసం శుద్ధి కర్మాగారం తగి వుంటుంది. అయితే, యీ జిల్లా ఖనిజ సంపద గురించి విపుల పరిశోధనను చేపట్టవలసివున్నది.

ఈ సహజ సంపదకు తోడు యిక్కడ యెడతెగని నీటి సరఫరా, చక్కని రోడ్లు, కాలువల, రవాణా సౌకర్యాలవంటి చక్కని పారిశ్రామిక వాతావరణం వున్నది. ఏలూరు, తణుకులలో సంకల్పించిన పారిశ్రామిక కేంద్రాలు యీ ప్రాంతంలో పరిశ్రమల స్థాపనకొక ప్రత్యేక సౌకర్యం.

ఈ ప్రాంతంలోగల వనరులను, పశ్చిమ గోదావరి, దాని చుట్టుపట్లగల వాడకం దృష్ట్యాను యీ ప్రాంతంలో దిగువ కొత్త పరిశ్రమలు సంకల్పించబడినవి:—

## రబ్బరైజుడు త్రాడు

మార్కెటులో లభించే రబ్బర్ ఫోమ్ బదులు రబ్బరైజుడు త్రాడు చక్కగా వుంటుంది. ఫోమ్ రబ్బరు ధర ఎక్కువ. రబ్బరైజుడు త్రాడును జిల్లాలో పోటీ రేటుకు తయారు చేయవచ్చు

## మత్స్య పరిశ్రమ

ఈ ప్రాంతంలో పచ్చి చేపలు పుష్కలంగా దొరుకుతవి. ఈ రొయ్య చేపల యెగుమతి వల్ల రూ. 1.5 కోట్ల వరకు సొమ్ము లభిస్తుంది. కాబట్టి, యీ జిల్లాలో మత్స్య పరిశ్రమ కేంద్రాలు కొన్నిటిని నెలకొల్పవచ్చు

## నల్ల సీసం శుద్ధి

జిల్లాలో నల్ల సీసం దొరుకుతుంది. శుద్ధి చేసిన నల్ల సీసం ముఖ్యంగా రాష్ట్రంలో నల్ల సీసం మూస పరిశ్రమలో వినియోగింపబడుతుంది. ఈ పరిశ్రమ, 1960 లో రమారమి రూ. 5 లక్షల విలువగల సరుకును వాడుకున్నది. ఈ వస్తువుకి గల గిరాకీని, ముడి సరుకు అక్కడ దొరికే కారణం వల్లను యీ జిల్లాలో యీ పరిశ్రమాభివృద్ధికి చాల అవకాశమున్నది

## అట్టల పరిశ్రమ

ఫైళ్లు, ఫైలు ప్యాడ్‌లు, పుస్తకాలు బైండు చేయడానికి, నోటు పుస్తకాలు మున్నగువాటికి అట్టలు అవసరం. వీటి గిరాకీ నానాటికీ హెచ్చుతున్నందున, వీటి తయారీకి కావలసిన ముడి పదార్థాలు స్థానికంగా దొరికే కారణం వల్ల యీ పరిశ్రమ స్థాపనకు అవకాశం వున్నది.

## జిగురు తయారీ

మార్కెట్టులో దొరికే యితర బంకలకంటె తోలు రద్దుతో తయారు చేసే జిగురు చాల బాగుంటుంది. స్థానిక తోలు పదును కర్మాగారాలలో వచ్చే రద్దు కొంత వరకు వృధా చేయబడుతున్నది. అవి వృధా పోకుండగ స్థానికంగా జిగురు పరిశ్రమను స్థాపించవచ్చు.

## చెఱకు మైనము

చెఱకు మైనం చెఱకు పరిశ్రమలో లభించే వుప పదార్థం. ఇది కార్బన్ కాగితాలు, మెరుగు పదార్థాల తయారీలోను, ఫలాల నిల్వ పరిశ్రమలోను వినియోగపడుతుంది. ఈ ప్రాంతంలో చెఱకు సమృద్ధిగా లభిస్తుంది కనుక పంచదార మిల్లు పక్కనే మైనం పరిశ్రమను నెలకొల్పవచ్చు.

## ఫల పరిశ్రమ

పశ్చిమ గోదావరి జిల్లాలో ముఖ్యంగా అరటిపళ్లు, మామిడిపళ్లు, నిమ్మజాతి ఫలాలు లభిస్తవి. వీటిని నిలవ చేయవచ్చు. కాబట్టి తణుకులో కాని పాలకొల్లులో కాని ఫలాల నిలవ కేంద్రం నెలకొల్పబడవచ్చు.

## క్రిమి సంహారులు

మొక్కల రక్షణకై జిల్లాలలో క్రిమి సంహారకమైన మందులు యెక్కువగా వాడబడతవి. 1960 లో, యీ జిల్లాలో రూ. 2.50 లక్షల విలువగల మందులు వాడబడినవి. కాబట్టి వీటిని స్థానికంగా తయారు చేయడానికి చక్కని అవకాశమున్నది.

## రంగుల పరిశ్రమ

వస్త్రాలు, తివాచీలు, ప్లాస్టిక్స్, తోలు సామాను మొదలైన వాటి తయారీలో రంగులు వాడబడతవి. ప్రస్తుతం అవి కలకత్తా, బొంబాయి, మద్రాసులనుంచి దిగుమతి చేసుకొనబడుతున్నవి. ఈ జిల్లాలో కేవలం వున్ని తివాచీల పరిశ్రమకే యేటా రూ. 25,000 విలువగల రంగులు కావాలి. 1961 లో యీ విషయంలో రాష్ట్రం అవసరాలు రూ 90.88 లక్షల విలువ కలవై వున్నవి. 1963 లో యీ అవసరాల విలువ 10.4 శాతం చొప్పున పెరిగి రూ. 109 73 లక్షలు కాగలవు. ఈ ప్రాంతంలో రంగుల పరిశ్రమ స్థాపనకు చక్కని అవకాశం వున్నది.

## హోల్డాల తయారీ

దేశంలో ప్రయాణ సౌకర్యాలు హెచ్చి, వ్యాపార వాణిజ్యాలు వృద్ధి పొందడంతో, యిటీవల హోల్డాల గిరాకీ హెచ్చింది. ప్రస్తుతం యివి తెనాలి, గుంటూరు, మద్రాసులనుండి తెప్పించుకొనబడుతున్నవి. 1960 లో రూ. 75,000 విలువగల సరుకు అవసరమైనది. జిల్లాలో హోల్డాల వాడకం పెరుగుతున్నందున, అక్కడ వీటి తయారీకి చక్కని అవకాశమున్నది.

## పెయింట్లు, వార్నిసులు

అలంకార, రక్షణ ప్రయోజనాలలోని బహువిధాలుగా పెయింట్లు, వార్నిసులు వాడబడతవి. ప్రస్తుతం ఏలూరులో కుటీర విభాగంలో ఒక కేంద్రం పనిచేస్తుంది. 1961 లో పశ్చిమ గోదావరి జిల్లాలో రూ. 45 లక్షల పెయింట్లు వార్నిసులు అవసరమైనట్లు అంచనా. వచ్చే సంవత్సరాలలో వాడకం యేట 10 శాతం హెచ్చవచ్చు కాబట్టి యీ ప్రాంతంలో వాటి తయారీకి మరి ఒకటి రెండు కేంద్రాలను నెలకొల్ప వచ్చు. స్థానికంగా దొరికే జీడిగురు మన్ను పచ్చ మన్నులను యీ పరిశ్రమకు వినియోగించే అవకాశాలను పారిశ్రామికులు పరిశీలించ వచ్చు.

## సీసం సీళ్లు

కొవ్వూరులోని సూపర్ ఫాస్ఫేట్ ఫ్యాక్టరీ వాడే సీసం సీళ్లు కలకత్తా నుంచిదిగుమతి చేసుకొనబడుతున్నవి. ప్రస్తుతం వీటి అవసరం పరిమితమై వున్నందున దీని తయారీని యిప్పుడువున్న స్టీల్ ట్రంకు కాని రేవిన్ ఇంజనీరింగ్ కేంద్రాలు కాని చేపట్టవచ్చు.

పరిశీలనా నివేదిక యీ కొత్త పరిశ్రమలను సంకల్పించుటయేగాక ప్రస్తుతపు పరిశ్రమల చిక్కులను సమస్యలను పరిశీలించి వాటి సహాయానికై సర్దిష్టమైన సిఫార్సులను చేసిందికూడా.

కథానిక

# పండుగ పంటు

రచన :
శ్రీమతి దర్భా భాస్కరం

వాడు కుర్చీలో కూర్చుని మూర్తి దీర్ఘాలోచనలో పడ్డాడు ఈ పండగ వెళ్లడ మెలా? రాకరాక చెల్లెలు పండక్కి వస్తూన్నట్టు ఉత్తరమొస్తే పరిస్థితుల్లో స్తబ్ధత తాండవిస్తోంది.

ఉత్తరం ఒచ్చి వారమైంది

చెల్లెలికీ బావ మరిదికీ బట్టలివ్వాలి. వాళ్లున్న నాలుగు రోజులూ సరైన కూరా నారా చూడాలి. ఒచ్చేటప్పుడు వాళ్ల టిక్కెట్లు కొనుక్కొని వచ్చినా వెళ్లేటప్పుడు తను కొనివ్వడం లాంఛనం. అవీ యివీ ఎంత లేదనుకున్నా రెండు పచ్చ కాయితాల మాట.

ఎక్కడ తేవడం?

తన జీతం ఎన్నింటికని సర్దగలడు? ధరలు చూస్తే ఆకాశాన్నంటుతున్నాయి.

పోనీ ఏ స్నేహితుణ్ణైనా అడుగుదామంటే వాళ్లకు మాత్రం ఏం ఎష్టేట్లేడిచాయని అందరూ గంతకుతగ్గ బొంత గాళ్లే. ఇంకా వాళ్లందరికన్నా తనే నయం. ఆలూ మగలూ యిద్దరే. వాళ్లకో, ఒకడికి చెల్లెలి పెళ్లి సమస్య, మరొడికి పెళ్లాం పురిటి సమస్య ఇంకోడికి పిల్లల జబ్బు సమస్యా—ఇలా రకరకాలుగా యిబ్బందులు పడే మిత్రమండలిని అడిగి లేదనిపించుకునే కంటె అడక్కుండా వూరుకోడమే నయం.

ఇప్పుడెలా? అక్కడికీ ముందు జాగ్రత్త కోసం మామయ్య యిచ్చే పదీ పరకా దాస్తూనే ఉన్నాడు—ఓ వందరూపాయలయ్యేయో లేదో, ఆ వెంకట్రావుగాడు అమాంతం గ్రద్దలా తన్నుకుపోయేడు వాళ్లమ్మని ఆస్పత్రినించి తీసుకు రావాలని గోలపెడుతూనూ

పాపం అంతవైద్యం చెయ్యించి యింటికి తీసుకొచ్చిన ఆ తల్లి కాస్తా ఇంటికి రాగానే కళ్లుమూసింది ఆ గందరగోళంలో ఇహ యిప్పట్లో వాడు అడబ్బు ఎలాగా యివ్వలేడు. అడగడమైనా ఏం బావుటుంది గనక!

అసలీ పండగలంటేనే మూర్తికి భయం. చేసే ఉద్యోగం అంతా అలావుండగా రోజూ పదిగంటలకి తినే తిండయినా ఆ రోజు అపరాహ్ణం దాటితేనేగాని దొరకదు. అదీకాక వంటింట్లో పడి ఆడవాళ్లు వాళ్లు హూనంచేసుకోడం, పండగ పేరుచెప్పి ఆడా మగా శ్రమా ఆకలీ అనుభవించాలి.

అక్కడికీ తను చెబుతూనే వుంటాడు. ఎందుకే, హాయిగా పదింటికి ఏదేనా తేలిగ్గా తినేద్దాం, పండగపూటా ఆ వంటింట్లో కూడుకుపోకు, అని—ఆమెగారికి నచ్చితేగా?

పన్లన్నీ అయి ఇవతలబడేసరికి నాలుగవడం. కొత్త బట్టలు ఏదో తెచ్చుకున్నాం కదా అన్నట్టు ఓపిక చేసుకు కట్టుకోడం—

ఉదయంనించి డబ్బుకోసం తిరిగీతిరిగీ కాళ్లు బంపాలు కట్టాయి, మెదడు ఖాళీఐంది. శరీరంతోబాటు అలిసిన మనసుతో, కుర్చీలో కూర్చుంటే కునుకు పట్టేసింది

తెలివొచ్చేసరికి కాఫీ కప్పుతో ప్రత్యక్షమైంది సరస్వతి.

'లేవండి. వాళ్లకి ఇంట్రను తెలీదు కూడానూ, స్టేషన్ కెళ్లండి—'

'వెళతాను —కాని—'

'కానీలేదు అర్ధణాలేదు; వెళ్లండి ముందు'

'అదే అంటున్నాను. చేతులో చిల్లికానీకూడా లేదు. ఇప్పుడెలాగా అని!'

'అబ్బ! తర్వాత చూడొచ్చునండీ—ముందు వాళ్లు స్టేషన్నించి ఇల్లు చేరే పద్ధతి చూద్దురూ!'

సరస్వతికి ఎక్కడా చీమకుట్టినట్టయినా లేదు. పండగ సరదా, అన్నీ తెలుస్తాయి గాని డబ్బు యిబ్బంది తెలియదెందుకో; ఓనిముషం చిరాకువేసింది మూర్తికి. చిరాకు పడ్డం యింకా అలవాటు కాలేదు. అలాగే చూస్తూ ఆదరా బాదరా బట్టలేసుకుని స్టేషన్‌కి నడిచాడు.

* * * *

బండి స్టేషన్లో నిలిచింది; మూర్తి ప్లాట్‌ఫాం చేరేసరికి. చురుగ్గా కళ్లు బండినంతటినీ వెతికేస్తున్నాయి. కాళ్లు గాభ

రాగా నడిచేస్తున్నాయి. ఆ గాభరాలో చెల్లెల్నీ బావగార్నీ మూర్తి చూడనేలేదు.

వెనకనించి 'అన్నయ్యా!' అన్న పరిచితకంఠం విని గిరున తిరిగాడు మూర్తి.

కంపార్టుమెంటు దిగి వాళ్లిద్దరూ ఆనందంతో తనవేపు చూస్తున్నారు. మూర్తి వాళ్లని చేరాడు. ఆనందంతో అతనికిమాటే రాలేదు. 'ఒచ్చారా' అన్నాడెలాగో

'అన్నయ్యా బాగున్నావా! ఒదిన బాగుందా అలా చిక్కిపోయావేమిరా?' ఇలా ప్రశ్నల వర్షం కురిపిస్తోంది జానకి.

ముగ్గురు జట్కాలో యెక్కారు. జట్కా ముందుకు సాగింది.

పువ్వులంగడి దగ్గిర బండాపి, ఉన్నరూపాయి మార్చి పావలా పువ్వులు కొన్నాడుమూర్తి

ఇంక మిగిలింది ముప్పావలా. బండీవాడి కర్ధరూపాయిస్తే ఇక మిగిలేది పావలా...మూర్తి జేబులో చెయ్యి తీసేశాడు–ఏదో తేలు కరిచినట్టు.

అన్నయ్యా, ఒదిన బావుందా?'

'ఊఁ–'

'ఎన్నో నెల'

'ఏమో!'

నవ్వు.

'ఓయబ్బ! యిప్పుడుదాస్తే పాపాయిపుట్టేక దాచలేవుగా!'

ఇల్లు చేరారు,

చాలా కాలానికి కలుసుకున్నారేమో, సరస్వతీ జానకీ కబుర్లతో పరాచికాల్తో కాలం మరిచిపోయి పరవశించి పోయారు.

సుబ్బారావు కూడా రాకెట్ల రాజకీయాల్నుంచి పత్రికల్లో పిల్ల దాకా తన అభిప్రాయాల్ని వెలిబుచ్చుతూ చర్చించేస్తున్నాడు. ఆ ఉత్సాహం సమస్యనే మరుగున పెట్టిందెలాగో మూర్తి కర్థం కాలేదు.

* * *

వంట ముగించుకొని ఒదినతో మంతనాలాడుతోంది సరస్వతి.

'సరూ, ఓసారిలా వస్తావా?'

సరస్వతికేమీ చీమకుట్టినట్టయినా లేదు. తెల్లారితే పండగ. ఇంట్లో సామాన్లయినా సరిపోతాయో లేదో, వాళ్ల గుమ్మంలో అడుగెట్టిన దగ్గర్నించీ అసలు మొహమే చాటయిపోయింది. ఏదైనా మాట్లాడ్డానికి లేదు.

'అబ్బా ఉండండి–'

'ఏమిటి ఉండడం–ఉండక నేనెక్కడికెళ్లనని!'

'నయం–ఇప్పుడెక్కడికీ వెళ్లకండి మీపుణ్యముంటుంది. తొమ్మిదవ్వస్తూంది; భోజనాలకి లేవండి– వాళ్లే వేళప్పుడు తిన్నారో కూడాను.'

అక్కణ్నించే సమాధానం చెప్పింది ఎలా అయితేనేం.

* * *

మూర్తికి మెలకువ వొచ్చేసరికి తెల్లారిపోయింది.

'లేవండి. భోగి మంటలేనా చూశ్లేదుమీరు–ఏమిటంత మొద్దునిద్దర పట్టింది మీకు!–వాళ్లప్పుడే తలంట్లూ పోసేసుకున్నారు– మీరింకా దుప్పటీ ముసుగుతన్ని–'

'మరి చలికాలం కదేభామా– ఇంతకీ–'

'ఇంతకీలేదు అంతకీలేదు. ఇందండి బ్రష్షూపేష్టూ–'

'హాయ్ భగవాన్! నీదింత మొండిగుండె అయిపోయిందేం సరూ!– పొద్దుటలేచి నీ మొహం చూసేను సుమీ–'

ఇంతలో రొజ్జగాలిలా ఒచ్చిందిజానకి ఆ గదిలోకి

'ఏమిట్రా పొద్దుటే మంత్రాంగం–?'

'ఏమీలేదూ–' మూర్తి ఆమెకట్టుకున్న చీరవేపు తదేకంగా చూస్తున్నాడు

'ఏమిటన్నయ్యా అలా చూస్తున్నావూ, బావుందా?'

'బావులేక పోడమేమిటి–బ్రహ్మాండంగా వుంది–కలర్ సెలక్షన్ ఎవరిదో గాని అద్భుతంగా వుంది స్మా!'

'అదేమిటన్నయ్యా ఎవరో చెయ్యడమేమిటి సెలక్షన్–?'

'ఊఁ ఊఁ–లేవండి తరవాత చూదాం. కలర్ సెలక్షన్ అదీనూ–' అని సరస్వతి అడ్డమొచ్చింది.

మూర్తి లేచాడు.

* * *

మొహం కడుక్కుని వంటిట్లోకి రాకుండానే తలంటి స్నానం చేసుకుని ఆలోచిస్తూ అరుగుల కూర్చున్నాడు మూర్తి.

జానకీ సుబ్బారావూ కొత్త గుడ్డలు తెచ్చుకున్నారన్న మాట. ఒళ్లంతా తేళ్లూ జెర్రులూ ప్రాకుతున్నట్లుంది. తను అసమర్థుడని గుర్తించి వాళ్లు బట్టలూ తెచ్చేసుకుంటే ఇంక తను వాళ్లని

పండక్కి పిలవడమెందుకు! ఇంకానయం? — ఓ వీసెడేసి మిఠాయిలు తెచ్చుకొని తినడం ప్రారంభించలేదు—

స్నానమైపోయేక ఊళ్లోకెళ్లి బట్టలకొట్లో అరువయినా పెట్టి ఓచీరా జామారేనా తేవాలి వాళ్లకి. వాళ్లు తెచ్చుకున్నవి యివాళ కట్టుకుంటే తను యిచ్చేవి రేపు కట్టుకోవచ్చు. ఇవ్వకపోతే బాగుండదు

'రండీ—కాఫీ చల్లార్తోందీ—మళ్లీ మళ్లీ నేనీ కాఫీల్తో కూచోలేను' అని సరస్వతి హెచ్చరిక...ఆజ్ఞ—'

'అలా వున్నారేం బావగారూ?—' బావగారి పలకరింపు.

'బాగానే ఉన్నానండీ—' తన పలవరింపు

రెండు ప్లేట్లతో ఉప్మా తెచ్చింది సరస్వతి.

సరస్వతివేపు చూశాడుమూర్తి. భావమంతా, ఆలోచనంతా తెలిసేటట్టు

సరస్వతి చిరునవ్వుతో వుంది.

జానకి తెచ్చిన కొత్తగాజులూ, బెంగాలీ రింగులూ పెట్టుకుంది. అసలే చూలాలు గావడాన్ని శరీరచ్ఛాయ పచ్చగా అయింది తలంటి పోసుకుని లూజ్‌గా జడేసుకొని ఈ విచిత్రమైన అలంకరణ చేసుకుంటే కొత్తగా వుంది; పాలిపోయిన చెక్కిళ్లు వెలిగారం తొక్కిన బంగారంలా వున్నాయి.

'కాఫీ కాగానే ఏమిటండీ ఎంగేజిమెంటూ?' బావగారి ప్రశ్న.

'నేనో మారు ఊళ్లోకెళ్లి రావాలండీ—'

'పండగపూట ఎక్కడికి మీరు? కాసేపు ఇంటి దగ్గిరుండురూ—' సరస్వతి మళ్లీ అధికారయుక్తమైన లాలన—

'అంత అర్జంటు కాకపోతే సాయంత్రం వెళదాం లెండీ— ఈ పూట రెండుగేమ్సు చెస్సాడుకుందాం.' బావగారి సలహా—

* * *

ఆటలోపడి ఎత్తుపై ఎత్తుల హుషార్లో సర్వమూ మరిచిపోయాడుమూర్తి. 'పన్నెండయిందన్నయ్యా ఇంకా మీ ఆట తెవల్లేదా,' అన్న జానకి పిలుపు విని లేచారిద్దరూ.

లేచీలేవడంతో మూర్తి ఆలోచన్లో పడ్డాడు. పొరపాటు జరిగిపోయింది. ఆటకి కూచున్నప్పుడు ఇదిగో ఓ ఆటాడి లేచేద్దాం అనుకున్న వాడల్లా ఆటలోపడి అన్నమే మరిచిపోయాడు.

'బజారికెళ్లాలనుకుంటూ టైం గడిపేశానండీ—' అన్నాడు కాళ్లు కడుక్కుంటూ

'అంత అర్జంటని చెప్పేరుగాదేం. ఇద్దరం కలిసే వెళ్లేవాళ్లంగా!'

పిండివంటలు మిఠాయింటి భోజనం పసందుగా తయారు చేసింది సరస్వతి. మూర్తి అనుమానంగా ఆమెవేపు చూశాడు. సరస్వతి ఏదో కబురుచెబుతూ జానకివేపు చూస్తోంది.

వాళ్లిద్దరికీ ఈగొడవే పట్టలేదు గలగలా ప్రవహించే సెలయేర్లో కెరటాల్లా, అంతులేని గాలిలో ఎగిరే పక్షుల్లా కిలకిలా ధ్వని చేసేస్తూ నవ్వుల్లో తేలిపోతున్నారు.

'ఓం భూర్భువస్వః' అంటూ కంచంచుట్టూ చెయ్యి తిప్పాడు, మూర్తి.

* * *

భుక్తాయాసం తీరేటందుకు నడుంవాల్చి మళ్లీ లేచేసరికి నాలుగున్నరైంది. 'అబ్బా! ఈ శీతాకాలంలో పగలు నిద్దురపోతే ఒళ్లు ఒడ్డీ మంగలాడికైనా లొంగనట్టయిపోతుంది.' అంటూ మరోసారి ఆవలించాడు. మూర్తి.

'అయిందా నిద్ర? ఫస్టుగా వుందండీ మీ వరసా' అంటూ ఎదురొచ్చింది. సరస్వతి. చేతులో రెండు చీరలు న్నాయి. 'ఇందులో నాకేది, జానక్కేది. మీరెంచండీ—?' అని ప్రశ్నవేసి చేతుల్లో పెట్టింది.

మూర్తి అటూయిటూచూసి 'ఎక్కడివీ?' అని మనస్సులోనే అనుకోవలసొచ్చింది.

'ఫరవాలేదులే అన్నయ్యా, నువ్వేది ఎంచుతే అదే పట్టికెళతాను' అంది జానకి ద్వారం దగ్గిర నిలబడి పకపకానవ్వుతూ,

'ఛీఛీ—అలా అయితే నే ఎంచను. నువ్వే ఎంచుకో?, అన్నాడు మూర్తి.

'ఆవిడ ఎంచడం అయిందండి. మేమిద్దరం పోటీపడ్డాం. మీకిందులో ఓచీరజానక్కివ్వడానికి నచ్చుతుందనీ—ఎంచండి మరి.'

'ఈ జరీ అంచున్న బ్లూశారీ జానక్కి బావుంటుంది. కనకాంబరం రంగుది నువ్వుంచుకో—' అన్నాడుమూర్తి ఎట్నుంచే దొస్తుందో అని భయపడుతూ.

'నే చెప్పలేదూ జానికమ్మా మొత్తంమీద అన్నా చెల్లెలూ వొకటే—'

మొత్తంమీద సరస్వతేనయం పీదంట ఒచ్చిన వాళ్ళదగ్గిర పుమ్చకుంది గాబోలు.

'మరి మీరు మొహం కడుక్కోడం ఉందాలేదా?' సరస్వతి దబాయింపు

'ఏమిటి గిరాకీ? ఎక్కడికేనా ప్రోగ్రాం వేసేరా,?'

'సినీమా కెళదావండీ!— అప్పుడే పక్కింటి ప్లీడరు గార బ్బాయి టిక్కెట్లకోసం వెళ్ళేడుకూడానూ.'

అయితే ప్లీడరుగారిభార్య 'ఆదుకుందన్నమాట. నయమే.

* * *

ఇలా ఇరవైనాలుగ్గంటలు గడిచేసరికి ఆనందం ఎక్కువైందోఆందోళన ఎక్కువైందో వూహించుకో లేకపోయాడు మూర్తి. సరస్వతి ఏదోలా పండగ వెళ్లిస్తున్నదని ఆనందం. ఇదంతా ఎంత తెచ్చి చేస్తోందో, ఎలాటి ప్రమాదకరమైన రుణమో అనిఆందోళన.

అడుగుదామంటే అన్నీ అడ్డంకులే. జానకి రావడం మొదలు: ఇద్దరూ కలిసే వుంటున్నారు సరూ, ఒక్కసారి ఇటురా, అంటే మీరేరద్దురూ. అంటోంది. స్నానానికి నీళ్ళదగ్గిర్నించీ విస్తట్లో భోజనం వరకూ అన్నీ యేర్పాటయ్యేకనే పిలుస్తున్నారు గాని మాటాడుకోడానికి యెడంలేదు.

నిద్రపోయేటప్పుడైనా హాల్లో చలి ఎక్కువంటూ నాలుగు మంచాలూ గదిలోనే యిరికించి వేసేరు. మొత్తం నలుగుర్లో ఎడబాటుతో, ఏకాంతం దొరక్కుండా అరవై గంటలు గడిచేసరికి మూర్తికి ప్రాణం కటకట్లాడింది.

సరస్వతి ఎక్కడో ఎక్కువే తెచ్చింది. సంక్రాంతినాడు వాళ్ల రాత్రిబండికే వెళిపోతార్ట గానీ. బజారికెళ్లి అతనికి రేమూన్సులో ఏవేనా పాంటుగుడ్డా శ్లాక్‌గుడ్డా తెచ్చిపెడుదురూ.' అని ముప్ఫై రూపాయలు చేతులో పెట్టి మడిచింది.

మారు మాటాడకుండానే వంటింట్లోకి దూరింది కూడానూ.

* * *

సాయంత్రం ఐదైంది. జానకి పెరట్లోకి వెళ్లింది. సుబ్బారావు డాబామీద పచారు చేస్తున్నాడు. సమయం చిక్కింది గదా అని మూర్తి గదిలోకెళ్లి 'ఏం చేస్తున్నావ్ సరూ.' అంటూ చూచున్నాడు బట్టలపెట్టె దగ్గిర.

'అబ్బ! మీరేనటండీ-గతుకుమన్నానూ' అని గాభరాగా పెట్టె మూసింది సరస్వతి.

'పిసరూ పిప్పీ ఉన్న వాళ్ళిలాగే ఎవరొచ్చినా గతుక్కుమంటారు.' అన్నాడుమూర్తి. అనాలనికాదు. అదోవాణి

'నాదగ్గిరేమిటుందండీ. పిసరూ, పిప్పీనూ!'

'పోనీలే నేనేమీ ఎకౌంటు అడగను గాని, కేవలం మెచ్చుకుంటున్నానంతే. బాగా మేనేజ్ చేశావే. మొత్తమ్మీద! ఎలాతెచ్చేవేమిటి?...ఏదీ ఇటు తిరుగూ, నీగొలుసేది సరూ—?'

సరస్వతి నవ్వింది. 'ఊఁహూఁ గొలుసు జ్ఞాపకమొచ్చిందే! మొన్న రామగోపాలం పెళ్లాం ఎవరింటికో పెళ్లికెళతానని ఎరువు పట్టిగెళ్లింది; మరిచిపోయేరా?'

'ఔనౌను...మరి ఇదంతా—ఎలా చేశావు సరూ?'

'అది రహస్యం—'

'నాదగ్గిరే రహస్యమా?'

'అనుకున్నది అయ్యేవరకూ అందరిదగ్గిరా రహస్యమే'

'నన్ను అందర్లోను జమ కట్టేశావా?'

'...అలా నన్ను కలిగించకండి '

'—పోనీలే—ఎలాగూ మొదలు పెట్టావు- వాళ్లు వెళ్లడానికి సెకెండ్‌క్లాసు టిక్కెట్లకి కూడా చూడు...అన్నట్టు విన్నటి కాశ్మీరు సిల్కుచీరా అతని పంచెల్చాపూ. నువ్వే తెప్పించేవా?'

మీరేమనుకున్నారూ?'

'ఊఁహూఁ నువ్వే తెప్పించావన్నమాట. ఒహవేళ వాళ్లు తెచ్చుకున్నారేమో అనుకున్నాన్లే—మరి—?'

హాల్లోంచి మెత్తగా ఓ పిలుపు—'సరస్వతమ్మ గారూ!'

'ఒచ్చే—' సరస్వతిలేచి తొంతరగా వెళ్లింది.

ఒచ్చినావిడ సుందరమ్మగారూ. స్త్రీజన సంక్షేమశాఖలో యస్. ఈ ఓ. ఏదాదికిత పొరుగున దిగింది; ప్లీడరుగారింటి ఇవతలివేపు వాటాలో.

'అసమయంలో వొచ్చానాండీ?' అనినవ్వుతూ పలకరించింది ఆవిడ

మొగాళ్లొచ్చి హాల్లో మాట్లాడుతున్నప్పుడు సరస్వతి ద్వారం దగ్గిర నించుని వింటుందోలేదో మూర్తికి తెలియదు. ఇప్పుడతను మాత్రం—గదిలో వేరేపనేమీ లేకపోవడంవల్ల గాబోలు, ద్వారం దగ్గిర నిలబడి వింటున్నాడు.

'అసమయం ఏముందండీ—ఇవాళ మా ఆడపడుచు వెళ్లిపోతోంది—'

'అదేమిటీ, పండగపూటే వెళుతుందా?'

'అవునండీ—రేపుకనుం; వెళ్లనివ్వంగా: ఎల్లుండి పొద్దుట ఆయన డ్యూటీలో వుండాలట; అందుకని యివాళే వెడతామంటున్నారు. గవర్నమెంటు ఉద్యోగస్థులు కదండీ, మనమాట వింటారా; అంతెందుకూ, మీరు పండగపూటా ఇంటికే వెళ్లలేదే—'

'దానికేం లేండి—'

'ఇంతకీ వచ్చిన పనేమిటో చెప్పేరుగాదు.'

'మరేనండీ—ఆ లేసెస్ అన్నీ—అవేనండీ, మనం ప్రిపేర్ చేసినవి—'

'హుష్—'

'ఓ—సారీ—అవన్నీనండీ గుజ్‌రాతీ వాళ్లట ఎవరో, మర్చంట్సు: అమ్ముతుంటారట, లాటును ఇచ్చేస్తారా అని అడగటానికి వచ్చేరండీ. వాళ్లని నిలబెట్టి ఇల్లా వొచ్చాను—మొత్తం రెండు వందల యాభై యిస్తామన్నారండీ — నా దగ్గిర మాదల్పు చూపించానూ.'

'సరేలెండి—'

సరస్వతి లోపలికొచ్చింది మొహమంతా, ఒళ్లంతా నవ్వేస్తోంది.

'అమ్మదొంగా, ఇక్కడున్నారా, మీరు!'

'దొంగెవరో తెలుస్తూనే ఉంది!'

'ఊరుకోండీ—ఆవిడ నిలబడుంది, పాపం!'

సరస్వతి ఒక కర్రపెట్టె చూపించి, ఇది సాయం పట్టండీ, ఆవతలికి!' అంది మూర్తి పట్టాడు. హాల్లోకి వచ్చి కెళ్లారు.

'వాళ్లని ఇక్కడికి తీసుకురండీ సుందరమ్మగారూ!' అంది సరస్వతి.

'సరేలెండి' అని ఆవిడ వెళ్లింది.

* * *

పెట్టె తెరిచింది సరస్వతి.

అందులో రకరకాల లేసులు ఎన్నో వున్నాయి.

తానుల్లోంచి కట్‌చేసిన చీరలకి కుట్టుకునే పైటంచులూ' లంగాలకీ జాకెట్లకీ కుట్టుకునే లేసులూ, గౌన్లమీదా, చిన్న చిన్న వాక్కాల మీదా కుట్టుకునే పువ్వులూ, ఊలు స్వెట్టర్లూ, ఇంకా కొన్ని ఎంబ్రాయిడరీ సరుకులూ, గుమ్మం తెరలూ, టేబిల్ క్లాతులూ, తలగడా గలీబులూ—ఎన్నో రకాలూ, ఎన్నో మూర్తులూ,

చిత్తుకాయితాలూ చిరిగిపోయిన గుడ్డలూ వుంచుకునే కర్ర పెట్టెనిండా ఇవన్నీ ఉల్లిపొర కాయితాల్లో చిత్రంగా ప్యాకింగ్‌చేసి పెట్టారు. మూర్తికి కళ్ళు చెదిరాయి.

'ఏమిటిసరూ, ఇవన్నీ?'

'ఇందులో మీకు తెలియని వింతవస్తువు లేవీ లేవుగదండీ—' అని ఇంకా చిలిపిగా నవ్వింది సరస్వతి

'అది సరే ననుకో—నాకేం అర్థంగాలేదు'

సరస్వతి ఆనందం అంతకన్నా ఎక్కువ.

'ఏముందండీ అంతకిముందు నెలనెలా జీతంలో పదేసి మిగిల్చి నూట ఎనభై రూపాయలు చేశానండీ. ఏడాది కితం సుందరమ్మగారు నాకేమైనా పని చేతనవుతుందేమో అని అడిగితే చెప్పాను, నాకు కుట్లూ అల్లికలూ చాలా బాగా వొచ్చునని. డబ్బు డబ్బుగా వుంచేస్తే లాభంలేదండీ, అంటూ తనుకూడా కొంతడబ్బు కలిపి వూలూ, దారాలూ, గుడ్డలూ, తెప్పించిదండీ. అలా పొద్దుట పదకొండు గంటల్నించి సాయంత్రం మూడున్నర వరకూ రోజూ ఏదో పాటు ఈ తొమ్మిది నెల్లా యీ పనిచేతే యిలా తయారయ్యాయండీ ఇవి. మొన్న పండగముందన్నమాట చేతిలో కానీ లేక అవస్థపడుతున్నాం కదా అని నూట ఇరవై రూపాయలకి కొన్ని అమ్మించాను, ఆవిడచేత. అవిచూసి ఇవాళ మొత్తంగా కొంటామని ఎవరో వచ్చినట్టున్నారు. ఆవిడకి అందరూ తెలుసునండీ; మంచి పలుకుబడి...

మూర్తి ఆనందంలో కొట్టుకు పోతున్నాడు.

'భేషయినపని చేశావు సరూ. అయితే నాతో చెప్తే నేనేమంటానని. చెప్పలేదు? ఇలా చెయ్యొచ్చుటే. నువ్వూ?' అన్నాడు ప్రేమగా సరస్వతి కపోలాల్ని తాకుతూ.

'అదికాదండీ; మేం మొదట అనుకున్నది ఒకటీ—'

'ఏమిటో అది—?'

'మరి ఇప్పుడు చెప్పడం దేనికిలెండి; అవసప్పుడు!'

'అవకపోతేనేం—సగం చెప్పావుగా'

'వెయ్యి రూపాయల సరుకయ్యాక బొంబాయి పంపిద్దామని అనుకున్నామండీ సుందరమ్మగారన్నగారు బొంబాయిలో పెద్ద బట్టలషాపులో పనిచేస్తున్నారట అక్కడైతే మంచిధర పలుకుతుందని అందావిడ.'

'భేష్ మంచి ప్లానేసిందే—ఏమో అనుకున్నానూ.'

'మరేనండీ—నాకేంతెలుసూ.ఆవిడొచ్చి యివన్నీ చెప్పేదాకా నాకసలు అల్లికలమీద ధ్యాసేలేదు. నేనావిడకి, ఈ సలహాలిచ్చినందుకూ, ఇందులోకొన్ని కొత్త వెరైటీలు నేర్పినందుకూ కొంత డబ్బివ్వబోయానండీ. ఆవిడ పుచ్చుకోలేదు సరిగదా, యిదంతా తనడ్యూటీ అంది. దీనికోసం గవర్నమెంటు ఆవిడకి జీతమిస్తున్నారంటుంది.'

'నాకిన్నాళ్లూ చెప్పకపోవడం చాలా అన్యాయం చేసావు. ఒక మహావ్యక్తి మనింటి పక్కనే వుంటే ఆవిడికి నేను ఇన్నాళ్లు చెయ్యెత్తి నమస్కారమైనా చెయ్యలేదు. నిజంగా సుందరమ్మగారు ధన్యురాలు సుమా.'

'మీరు ఆనందించడం నా అదృష్టం.

# సవరల మనస్తత్వాదులు

శ్రీ జి. వి. రామమూర్తి

సవరలు చూడ్డానికి చాలా మోటుగా మనకు కనబడతారు. వారి వేషభాషలు, తీరుతెన్నులు మనకు అలా కనుపిస్తే కనుపించ వచ్చును గాని వారి మనసు వెన్నవంటిది. వారి దృష్టిలో అందరూ సమానులే. అధికారరీత్యా ఎవరైనా గొప్పవారైతే కావచ్చును గాని యితరత్రా నిత్యజీవితంలో సంఘంలోనివారందరూ సమానులేనని వారు భావిస్తారు.

ఒకసారి ఒక సవరవాడు తన గ్రామాధికారి గొమాంగ్ ఇంటిముందు నుంచి వెళ్తున్నాడు. అప్పుడే గొమాంగ్ భోజనం చేసి, అరుగుమీద కూర్చుని చుట్ట చుట్టుకుంటున్నాడు. "ఏం గోమాంగ్ ! భోజనం అయినట్టుందే ?" అని సామాన్యుడ్ని పలకరించినట్టే పలకరించాడు.

"ఔను యిప్పుడే అయింది" అన్నాడు గొమాంగ్.

"ఔను నీకేం ఒక పెళ్ళాం వండుతుంది ఇంకో పెళ్లాం వడ్డిస్తుంది. ఇంకో......సరే దానికేంలే గాని నాకొక చుట్ట యిస్తావా ?"

"ఓ దానికేం, రా. వచ్చి కూర్చుని నువ్వు చుట్టుకో" అన్నాడు గొమాంగ్.

"అలాగే నేను చుట్టుకుంటాను" అంటూ గొమాంగ్ ప్రక్కని కూర్చునే చుట్ట చుట్టుకున్నాడు. ఆ సవరవాడు. గ్రామ పరిపాలనా విధానంలో గ్రామాధికారులకు యివ్వవలసిన మర్యాదను యిచ్చి వారి, తీర్పులకు బద్ధులై సవరలు ఉంటారేగాని అయిన దానికి, కానిదానికి "చిత్తం, చిత్తం" అంటూ చేతులు నులుపుతూ అధికారులకు నిత్యజీవితంలో అణగి మణిగి ఉండరు. ఈ విధంగా వారి సవర అధికారుల వద్దనే కాదు. ఇతర ప్రభుత్వ అధికారుల వద్ద కూడా ఉంటారు.

ఒకసారి ఒక ఫారెస్టు ఆఫీసర్ వద్దకు ఒక సవరవాడు వాడు వ్యవసాయం చేసుకొనడానికి కొత్త కొండని యిమ్మని అర్జీ పెట్టుకొనడానికి వచ్చాడు.

"ప్రతీ సంవత్సరం ఒక కొత్త కొండను తీసుకొని, వోడు కార్చి అడవిని పాడుచేస్తే ఎలాగ ; పాత ప్రదేశంలోనే మన్ను, మశానం వేసి మళ్లా వ్యవసాయం చేసుకోవాలి పోయి అలా చేసుకో" అని చెప్పి, ఆ ఆఫీసరు ఏదో వ్రాసుకుంటున్నాడు. ఆ ఆఫీసరు ఆ కాగితం వ్రాయడం పూర్తి చేసే వరకు ఆ సవరవాడు మాట్లాడకుండా నిలబడి, ఆ ఆఫీసర్ కొత్త కాగితాన్ని వ్రాయడానికి తీయగనే "ఆగుదొరా ! వ్రాసిన కాగితంమీదనే ఎందుకు వ్రాయవు? కొత్త కాగితాన్ని ఎందుకు పాడుచేస్తావు ?" అని అడిగాడు

ఆ ఫారెస్టు ఆఫీసరు ఆ సవరవాని సమయస్ఫూర్తికి మెచ్చుకుని కొత్త కొండను వ్యవసాయానికి యిచ్చాడు.

గంజాం జిల్లా కలెక్టర్‌గా ఉండిన ఆస్టిన్ దొరగారు ఒకసారి సెరంగ్ అనే ఒక పెద్ద సవర గ్రామంలో భేటీ ఏర్పాటు చేశారు భేటీ అయిన తర్వాత ఆ దొరగారు వచ్చిన సవరలందరకూ తలొక చుట్ట యిచ్చారు ఆయన కూడా ఒక చుట్టను వెలిగించి అగ్గిపెట్టెను టేబుల్ మీద పెట్టుకున్నారు. చెకుముకి రాళ్ళున్న సవరలంతా వారి వారి చుట్టలను వెలిగించుకున్నారు. ఒక సవరవానివద్ద చెకుముకి లేదు. అందువల్ల టేబిల్ మీద నున్న కలెక్టర్‌గారి అగ్గిపెట్టెను వాడు తీసుకొనబోయాడు టేబుల్ ప్రక్కనే నిలబడ్డ తాసిల్‌దారు వాడ్ని ఆపుచేశాడు

"మీ దొరగారు నన్ను కాల్చుకోమని యీ చుట్టను యిచ్చారా లేక నా తలపాగాలో తురాయిలాగ అందంగా తురుముకోమని యిచ్చారా ?" అని నిర్భయంగా అడిగాడు ఆ తాసిల్

దారుని. ఆస్టిన్ దొరగారు ఆ విషయాన్ని తెలుసుకుని, ఆయనే స్వయంగా అగ్గిపుల్లను వెలిగించి సవరవాడికి యిచ్చారు. వాడు చుట్ట ముట్టించుకొని పొగ వదుల్తూ "ఏమయ్యా యిప్పుడు ఏమంటావు ?" అని తాసిల్‌దారుని అడిగాడు.

ఒక సవరవాడు పొలం దున్నుతూ ఉండగా ఒక అధికారి అక్కడకు వెళ్లాడు. ఆ సవరవాడు కాడికి ఒక ఎద్దును, ఒక ఆవును కట్టి దుక్కి దున్నడం యీ అధికారి చూసి "ఏమిరా ఆవును కాడికి కట్టి దున్నుతున్నావు ? నీకు పాపం రాదురా ?" అని అడిగాడు.

"ఏమన్నావు దొరా ? నాకు పాపం వస్తుందా ? అయితే యిటు చూడు. నేనూ కష్టపడుతున్నాను, నా పెళ్లాం కష్టపడుతున్నాది, నాతో కూడా మరి యీ ఎద్దు, వీడి పెళ్లాం యీ ఆవు ఎందుకు కష్టపడకూడదు ?" అని అడిగాడు.

ఇటువంటి ముచ్చట్లు సవరలకు సంబంధించినవి అనేకంగా ఉన్నాయి. వారు అమాయకులైనా తెలివితేటలకు, సమయస్ఫూర్తికి ఎవరికీ తీసిపోరు.

## సంక్షేమము

మనదేశములోని వారి అందరికన్నా కడు ప్రాచీనులు సవర మొదలయిన ఆటవిక జాతివారు. వీరు ద్రవిడులకు, ఆర్యులకు జడిసి, పల్లపు ప్రదేశాలను విడిచి కొండలలోనికి పోయి, అడవులలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. అయినా పల్లపు ప్రదేశాలను వారిస్తూ ఉండిన రాజులకు వీరికి అప్పుడప్పుడు యుద్ధాలు జరుగుతూ ఉండినట్లు మన పురాణ ఇతిహాసముల వలన తెలుస్తున్నది. కాని వీరు తమకంటే బలమైన రాజులను ఎదిరించలేక అనాదిగా కొండలమీదనే ఉండిపోవలసి వచ్చినది. కొండల మీద వీరిని యితరులు జయించలేకపోయినారు అందువలన వీరు స్వతంత్రులయి ప్రత్యేక వ్యక్తిత్వముతో సుమారు రెండువందల సంవత్సరముల క్రితము వరకూ స్వపరిపాలన చేసికొంటూ ఏపల్లెకు ఆ పల్లె ఒక రాజ్యముగా ఏర్పరచుకున్నారు. ఎప్పుడైనా ఇతరులు వీరి మీదికి దండెత్తిరావడము సంభవిస్తే చేరువలో నున్న అయిదారు గ్రామాలవారు ఏకమవుతూ ఉండేవారు.

సుమారు 150 సంవత్సరాల క్రితం పర్లాకిమిడి రాజులలో ఒకరు సవరలపై దండెత్తి వారిని జయించి తమ స్వాధీనములోనికి తెచ్చుకున్నారు. అప్పటి నుండి యీ పర్లాకిమిడి రాజులు వారి ప్రతినిధులుగా బిసోయిలను (అధికారులను) నియమించారు. తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం క్రిందకు పర్లాకిమిడి జమీందారీతో పాటు యీ సవర దేశము కూడా వచ్చినది. ఇదే విధముగా ఇతర కొండజాతుల వారు కూడా బ్రిటిష్‌వారి పరిపాలనలోకి వచ్చారు.

ఈ కొండజాతులవారికి యితరులతో సంపర్కం ఏర్పడక పోవడం వల్లనూ, పల్లపు ప్రదేశాలలోని నాగరకులయిన ఆర్యులు, ద్రవిడులు వీరిని తమతో చేర్చుకోక పోవడం వల్లనూ, వీరి తెలివితేటలు అభివృద్ధి పొందక అనాగరకులవలనే ఉండిపోవలసి వచ్చినది. వీరి క్షేమం కోరినవారు పూర్వం ఎవరూ లేక పోయినారు.

వీరితో కాస్త పరిచయము చేసికొన్న నాగరకులలో కొంతమంది వీరి అమాయకత్వాన్ని ఆధారం చేసికొని స్వలాభం కోసము 'నేస్తం' అంటూ కట్టడం మొదలు పెట్టారు. వీరికి కష్టకాలంలో సహాయం చేస్తున్నట్లు నటించి, అప్పులు యిచ్చి ఆ అప్పులు పూర్తిగా తీరకుండా ఏర్పాట్లు చేసికొంటూ, వడ్డీలమీద వడ్డీలను పెంచుతూ లాభాలు సంపాదించడం మొదలు పెట్టారు. ఈ సవరలు కష్టపడి, చెమటోడ్చి దిగువ ప్రదేశాలకు అమ్మడానికని తెచ్చే కర్రలు, చింతపండు, తేనే మొదలయిన ఆటవిక సంపదను వీరికి అప్పులు యిచ్చే సౌండివారు, పానోలు, మొదలయినవారు వీరిని మోసపుచ్చి అతి చౌక ధరకు తీసికొని యిప్పటికీ మంచి లాభాలు సంపాదిస్తున్నారు.

బ్రిటిష్ పరిపాలనలోకి వచ్చిన తర్వాత వీరి జీవితము కొంత మెరుగయినదే కాని వీరి సాంఘిక అభివృద్ధికి ఎక్కువగా బ్రిటిష్‌వారుకూడా శ్రద్ధ వహించలేదు.

స్వర్గీయ జంగం లక్ష్మీజీ పంతులుగారు కోదుల భాష అయిన కూయి నేర్చుకొని ఆ భాషకు వ్యాకరణము రచించారు. ప్రభుత్వ ఉద్యోగులు యీ కూయి భాషను యీ గ్రంథ సహాయముతో నేర్చుకుని కోదులకు సన్నిహితులు కాగలరని వారు ఆశించారు.

సుమారు 70 సంవత్సరాల క్రితం స్వర్గీయ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు సవరల యందు శ్రద్ధ తీసికొన్నారు. సవరభాషకు ఒక లిపిని కల్పించి వారిని కూడా అక్షరాస్యులుగా చేయగలిగితే వారికి కూడ నాగరికత అలవడగలదని ఆశించారు. అందుకని సవరభాషను ఒక ద్విభాషివద్ద క్షుణ్ణంగా నేర్చుకుని సవరలస్నేహం సంపాదించారు.

వారి ఆచార వ్యవహారాలను బాగా పరిశీలించారు. తర్వాత ప్రభుత్వ అధికారులకు సవరల పురోభివృద్ధికి ఏమిచేయాలో వీరు సూచించారు. వీరికి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం వారి సహకారం లభించింది. అటుపిమ్మట తెలుగు లిపిలోనే సవరభాషకు వాచకాలు, వ్యాకరణము రచించారు. కాని తెలుగు లిపి సవరభాషకు పూర్తిగా సరిపోలేదని గుర్తించి ఫొనెటిక్ లిపి అన్ని విధాలా ఆ భాషకు అనువైనదని నిర్ణయించారు. ఈ లిపిలో సవరా–ఇంగ్లీషు. ఇంగ్లీషుసవర నిఘంటువులు, వ్యాకరణమురచించారు. కొంతమంది చురుకైన సవర ఉపాధ్యాయులకు వారి యింటి వద్దనే యీ ఫొనెటిక్ లిపిని నేర్పి తగిన శిక్షణ యిచ్చారు.

వీరి కృషికి బ్రిటిష్ ప్రభుత్వంవారు మెచ్చి 1913 సంవత్సరములో రావుసాహెబ్ బిరుదును 1933 సంవత్సరంలో కైజర్–ఇ–హింద్ బంగారు పతకమును యిచ్చారు. వీరికి చేదోడు వాదోడుగా యీ సవరభాషా కృషికి తోడ్పడినవారు వారి పెద్దకుమారులు వేంకట సీతాపతిగారు వీరుకూడా సవరభాషకు క్షుణ్ణంగా తండ్రిగారి వద్దనే నేర్చుకుని, సవరల ఆచార వ్యవహారములను గూర్చి, సాహిత్యమును గూర్చి పరిశోధనలు జరిపి అనేక వ్యాసములను రచించారు.

ఇప్పుడు మన ప్రభుత్వం వారు ప్రవేశపెడుతున్న సహకార వ్యవసాయం సవరలకు క్రొత్తకాదు. గ్రామ మొత్తంమీద అన్ని యిండ్లవాళ్లూ కలసి వ్యవసాయంచేసి, వచ్చిన ఫలసాయాన్ని అందరూ పంచుకొనడం వారిలో కొన్ని చోట్ల పూర్వమునుండీ ఉన్నది. కాని వారు పండించే పంటలను నిలువచేసికొని మరుసటి సంవత్సరము తినకూడదన్న మతాచారంవలన వారు అప్పుడప్పుడు కరువు కాటకములకు లోనవుతూ ఉంటారు. వీరు అడవులలో సేకరించే సంపదకు తగిన విలువ కట్టలేక అనవసరంగా పేదరికాన్ని అనుభవిస్తున్నారు.

కొండజాతులవారి సంక్షేమమును గురించి విచారించవలసినదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు యీ మధ్య ఒక సంఘాన్ని నియమించారు ఆ సంఘంవారు పర్యటించి వీరిని గురించిన విషయాలను సేకరిస్తున్నారు.

(సమాప్తము)



# విశేషాలు

## చలనచిత్ర నిర్మాణంలో ఆంధ్రకు ద్వితీయ స్థానం

రేడియో, సమాచార, మంత్రిత్వశాఖ 1961–62 వార్షిక నివేదిక ప్రకారం 1961 లో భారతదేశంలో నిర్మితమైన చలన చిత్రాల సంఖ్యలో తెలుగుకు ద్వితీయ స్థానం లభించింది

1961 లో ఫిల్మ్ సెన్సార్ బోర్డు దేశంలో నిర్మితమైన 303 కథా చిత్రాలను ఆమోదించినది. ఇందులో 98 హిందీ చిత్రాలు, 55 తెలుగు చిత్రాలున్నాయి. 49 చిత్రాలు గల తమిళానికి తృతీయ స్థానం, 36 చిత్రాలు గల బెంగాలీకి చతుర్థ స్థానం వచ్చినవి. భారతీయ చలనచిత్ర పరిశ్రమ ప్రపంచంలో రెండవ పెద్ద పరిశ్రమ.

## నెల్లూరులో యురేనియం

అరుదైన రేడియో–ఆక్టివ్ ఖనిజమైన యురేనియం, ఇటీవల నెల్లూరు జిల్లా అభ్రకం గనిప్రాంతపు కొన్ని ప్రదేశాలలో భారత భూగర్భ పరిశోధక శాఖా బృందానికి కనబడినదట. ఈ బృందం, నెల్లూరుజిల్లా, గూడూరుకి ఉత్తరాన గల కనిచేరులో అభ్రకం విషయంలో జరిపిన ఒక సందర్భంలో వారు యురేనియం ఉనికిని గమనించారు. భారత భూగర్భ పరిశోధక శాఖ యివిషయాన్ని, అణుశక్తి కమీషనుకి తెలియ బరచినది.

# తైమిష్ట సమిష్ట

శ్రీ పి. రంగా రెడ్డి

పంధొమ్మిది వందల యాభై ఆరంభంలో గ్రామాభివృద్ధి సిద్ధాంతం, పద్ధతులు, సాధన సంపత్తుల విషయంలో పరిపూర్ణమైన మార్పు వచ్చింది. అప్పటి వరకు గ్రామాభివృద్ధికై అక్కడక్కడ ప్రయత్నాలు జరిగేవి. తరుచు యీ పని కొన్ని కార్యకలాపాలకే పరిమితమై వుండేది. కాని ఆధునిక విజ్ఞానం ప్రాతి పదికగా గల అభివృద్ధికై వ్యవస్థీకృతమైన కృషి చాల అవసరం. ఈ కారణంవల్ల, గ్రామ జీవితపు వివిధ అంశాలకు పరస్పర సంబంధం కలదనీ, యేఒక్క అంశం విషయంలోనో విడిగా పని జరిగితే శాశ్వతమైన ఫలితాలు సమకూరవని గుర్తించబడినది. ఈ ముఖ్య విషయం గుర్తింపు వల్లనే సమాజాభివృద్ధి అనే కొత్త సిద్ధాంతం బయలు దేరినది. ఈ సమాజాభివృద్ధికి సారభూతమైన అంశం, సహకార సూత్రాన్ని వివిధ రూపాలలో అనువర్తించి మానవ, సహజ సంపదల వనరులను పూర్తిగా అభివృద్ధి పరస్తున్నది, వ్యష్టిగా ఆత్మసామర్థ్యానికి, సమిష్టిగా స్వకీయమైన పూనికకు ప్రోదిచేసి, ఆ విధంగా అభివృద్ధికి కీలకంగా ప్రజాశక్తినే సమీకరించుట యీ కార్యక్రమం పరమావధి. ఈ కార్యక్రమం ఆరంభంలో, సహజంగా పనినంతను అధికారులే చేయవలసి వచ్చేది. తరువాత క్రమంగా ప్రజలు పాల్గొనడం ప్రారంభించారు. అయితే "ఏ పరస్పరితా గుణలక్షణాలవల్ల వ్యక్తుల సమూహం ఒక సాంఘిక వ్యవస్థగా యేర్పడుతుందో, కమ్యూనిటీని సంఘవరంగా వాడినప్పుడు యేయే అభిప్రాయాలు మన మనస్సులో వున్నవో వాటిని" సాధించుటలో యీ కార్యక్రమం వెనుకబడినదనీ, అలాగే పరిపాలనకు ప్రజల అండదండలను పొంది, మళ్లీ ఆ ప్రజలలో స్వయం సామర్థ్యాన్ని కలిగించడమనే జోరు ఆశయాలు కొంత వరకు మాత్రమే ఫలప్రదం చేయబడినవని ఒక అభిప్రాయం వుండేది. ప్రణాళికా ప్రాజెక్టుల విషయాన్ని పరిశీలించిన శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటీవల్ల పై అభిప్రాయం మరింత స్పష్టమైనది. ఈ కమిటీ వారు జిల్లా పరిపాలనను మూడు శ్రేణులుగా విభజించమని సూచించారు. ఇందులో మొదట గ్రామస్థాయిలో పటిష్ఠం చేయబడిన గ్రామపంచాయితీ వుంటుంది, తరువాత బ్లాక్ స్థాయిలో పంచాయితీ సమితి వుంటుంది. ఆఖరున జిల్లా స్థాయిలో ప్రాతినిథ్య జిల్లా కౌన్సిలు లేక జిల్లా పరిషత్తు వుంటుంది. ఈ కార్యక్రమం చక్కగా కొనసాగాలంటే, అది స్థానిక నాయకుల ద్వారాను, ప్రజా సంస్థల ద్వారాను అమలు జరగాలి.

కాబట్టి, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టంలో మూడు శ్రేణుల ప్రజా సంస్థలు వుద్దేశించబడినవి. గ్రామ స్థాయిలో పంచాయతీ, బ్లాక్ స్థాయిలో పంచాయతీ సమితి, జిల్లా స్థాయిలో జిల్లా పరిషత్తు, ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాస్వామ్య పద్ధతిలో అధికార వికేంద్రీకరణ క్రింద, అట్ట అడుగు ప్రజా సంస్థగా గ్రామస్థాయిలో గ్రామ పంచాయితీ యేర్పరుపబడినది. ఈ ఒక్క సంస్థకే ప్రత్యక్షంగా ఎన్నికలు జరుగుతవి. దీనిపైనగల పంచాయితీ సమితికి, జిల్లా పరిషత్తుకు పరోక్ష యెన్నికలు జరుగుతవి. ఈ విధంగా, వివిధ స్థాయిలలో గల యీ సంస్థలకు పరస్పర సంబంధం వుంటుంది. నేడు రాష్ట్రంలో 354 పంచాయతీ సమితులు జిల్లాకొకటి చొప్పున 20 జిల్లా పరిషత్తులు వున్నవి. పూర విస్తరణ బ్లాక్‌లు మొదట అంచె బ్లాకులుగా మార్పు చెందినప్పుడల్లా యింకా పంచాయితీ సమితులు ఏర్పరచబడగలవు.

బ్లాక్‌లోగల అన్ని పంచాయతీల అధ్యక్షులు సమితి సభ్యులుగా వుంటారు. ఒక బ్లాక్ యే నియోజక వర్గంలో కలదో, ఆ నియోజక వర్గం నుంచి లెజిస్లేచర్‌కి యెన్నికైన సభ్యులు సమితిలేక దాని సాయి

సంఘాల సమావేశాలకు హాజరు కావచ్చు, కార్యక్రమంలో పాల్గొనవచ్చు. అయితే వారు జిల్లా పరిషత్తు సభ్యులుగా ఓటు హక్కును వినియోగించుకుంటారు. కాబట్టి పై సందర్భంలో ఓటు వేసే హక్కుమాత్రం వారికి వుండదు. అలాగే, రెవిన్యూ డివిజినల్ ఆఫీసర్ (డిప్యూటీ కలక్టరు) కూడ తన ఆధిపత్యం క్రిందగల ప్రదేశంలోని పంచాయతీ సమితి లేక దాని స్థాయి సంఘాల కార్యక్రమంలో పాలొనవచ్చు. పంచాయతీ సమితి సభ్యులు దిగువవారిని కో అప్టు చేసుకుంటారు:— ఒక స్త్రీ, షెడ్యూల్డు కులాల ప్రతినిధి ఒకరు, బ్లాక్‌లోగల మొత్తం జనాభాలో షెడ్యూల్డు జాతుల జనాభా నిర్ణీతమైన ఒక శాతం దాటినప్పుడు వారి ప్రతినిధి నొకరిని. అలా జరుగని సందర్భాలలో షెడ్యూల్డు కులాలనుంచి మరొకరు; పరిపాలన, ప్రజా జీవితం, గ్రామాభివృద్ధి లేక సాంఘిక సేవలో అనుభవం గల యిద్దరు వ్యక్తులు—ముందులో ఒకరు స్త్రీ రెండవవారు బ్లాక్‌లో పనిచేస్తున్న సహకార సంఘపు సభ్యుడు. ఈ విధంగా యేర్పడిన పంచాయతీ సమితి సభ్యులందరూ తమలోనుంచి అధ్యక్ష, ఉపాధ్యక్షులను యెన్నుకుంటారు.

బ్లాక్‌లోపల, దాని అభివృద్ధి విషయంలో, సమాజాభివృద్ధి కార్యక్రమం అమలుతో సహా, పరిపాలనా వ్యవహారాలను పూర్తిగా పంచాయితీ నిర్వహిస్తుంది. ఇందుకు అనుకూలంగా, ప్రాంతంలో బ్లాక్ వ్యవసాయ, పశుపోషణ, పరిశ్రమలు, విద్య, స్త్రీ సంక్షేమ, సాహకార, సాంఘిక సంక్షేమ శాఖల వంటి ప్రభుత్వ అభివృద్ధిశాఖలు నిర్వహించే పనిని ప్రభుత్వం పంచాయితీ సమితులకు అప్పగించింది. పాత జిల్లా బోర్డులు చేసే పనులలో చాల భాగం అనగా ప్రాథమిక విద్య, ప్రజారోగ్యం, వైద్యం మున్నగునవి పంచాయితీ సమితులకు బదిలీ చేయబడినవి. చిన్న నీటి పారుదలకు సంబంధించిన పని అంతా కూడ పంచాయితీ సమితులకు అప్పగించబడినది. ఈ విధంగా, బ్లాక్ స్థాయిలో సర్వ అభివృద్ధి కార్యకలాపాలను పంచాయితీకి అప్పగించటమనేది ప్రభుత్వ పరమాశయమై వున్నది.

పంచాయితీ సమితుల పరిపాలన సంఘాల పద్ధతిలో జరుగుతుంది. వివిధ కార్యక్రమాలను సమర్థతతో నిర్వహించుటకై ఒక్కొక్క సమితికి అయిదు స్థాయి సంఘాలున్నవి:— ఒకటి వ్యవసాయం, పశుపోషణ, చిన్నపీటి పారుదల మున్నగు పనులను చూస్తుంది. అలాగే రెండవది, సహకారం, కుటీర పరిశ్రమలు వగైరాలను; మూడవది, సాంఘిక విద్యతో సహావిద్యను, ఆరోగ్య, పారిశుద్ధ్యాలను, వైద్యరక్షణ, సాంఘిక సంక్షేమం వగైరాలను; నాలుగవది, రాకపోకల సౌకర్యాలు మున్నగు వాటిని; అయిదవది, పనువిధింపు, ఆర్థిక విషయాలను చూస్తవి. ప్రభుత్వం అవసరమనుకుంటే, స్త్రీ శిశు సంక్షేమానికొక ప్రత్యేక సంఘాన్ని యేర్పరచవచ్చు. అలాగే పంచాయతీ సమితులలో యేదైనా, యితర విషయాలు వేటికయినా మరికొన్ని స్థాయి సంఘాలు అవసరమనుకుంటే ప్రభుత్వం అనుమతితో ఏర్పరచుకొనవచ్చు. ఈ స్థాయి సంఘాలకు, ఒక హద్దులో స్వతంత్ర మంజూరీ అధికారం వుంటుంది కాబట్టి అవి ఆ హద్దులోగల పనులను, పథకాలను మంజూరు చేసి, అమలు పరచ గలవు.

బ్లాక్ అభివృద్ధి అధికారి పంచాయితీ సమితి యొక్క ప్రధాన కార్య నిర్వహణాధికారియై వుంటాడు విస్తరణ సిబ్బంది యేమి, బ్లాక్ పనిచేస్తున్న మామూలు శాఖల సిబ్బంది యేమి పంచాయితీ సమికి అధికారానికి లోబడి దాని క్రింద పనిచేస్తూ వుంటారు.

పంచాయితీ సమితులు, వాటి స్థాయీ సంఘాల తీర్మానాలను అమలు జరపడానికై ఆ పంచాయితీ సమితి అధ్యక్షునికి బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరుపై పరిపాలనా విషయకంగా అజమాయిషీ వుంటుంది.

పంచాయితీ సమితి నిధులు ఈ క్రింది వాటితో ఏర్పడతాయి.

(1) సాధారణ ప్రయోజనాలకై ఒక బ్లాలోని ప్రజలలో భూమిశిస్తునుంచి తల ఒకరికి 25 న. పై. లు

(2) బ్లాకులోని ప్రజలవద్దనుంచి రవాణా సౌకర్యాలకై తల ఒకరికి 30 న. పై. లు

(3) బ్లాకు ప్రాంతంలో ఆస్తుల మార్పిడిపై వేసే పన్నులో 5వ వంతు

(4) బడ్జెట్‌లో సమాజాభివృద్ధికై కేటాయించిన వాటి విధులు

(5) ఖాదీ, గ్రామీణ పరిశ్రమల సంఘం, ఇంకా ఇతర అఖిలభారత సంస్థల నుంచి నిధాలు

(6) పంచాయతీ సమితులకు పంచాయతులు ఇచ్చే విరాళాలు.

(7) ప్రజల విరాళాలు.

(8) పంచాయతీసమితి అప్పుచేయడానికి అనుమతించబడిన సొమ్ము. పంచాయతీసమితికి తగిన వనరులు వుంటవి. ఒక్కొక దాని ఆదాయం సగటున రూ 4_5 లక్షలు వుంటుంది.

(9) వివిధ కార్యకలాపాలకై ప్రభుత్వం ఇచ్చే సహాయక గ్రాంట్లు

జిల్లా స్థాయిలో వుండే జిల్లాపరిషత్ ఈ క్రింది సభ్యులతో ఏర్పాటవుతుంది.

(1) జిల్లాలోని అన్ని పంచాయతీ సమితుల అధ్యక్షులు.

(2) జిల్లా కలెక్టరు.

(3) రాష్ట్ర శాసనసభకు ఆ జిల్లా నుంచి ఎన్నికైన సభ్యులు.

(4) ప్రభుత్వం ఉత్తర్వు ద్వార పేర్కొనబడిన రాష్ట్ర శాసనమండలి సభ్యులు.

(5) ఆ జిల్లాలోని నియోజకవర్గం నుంచి పార్లమెంటుకు ఎన్నికైన సభ్యులు.

(6) ప్రభుత్వం ఉత్తర్వు ద్వారా పేర్కొనబడిన రాజ్యసభ సభ్యులు.

(7) పంచాయతీసమితి ఏర్పడని ప్రతి బ్లాకులో_ఆ బ్లాకులో పంచాయతీల అధ్యక్షులు ఎన్నిక చేసిన బ్లాకు ప్రాంతంలోని ఒక వ్యక్తి.

పైన పేర్కొనబడిన సభ్యులంతా ఇద్దరు స్త్రీలను_ఒకరిని షెడ్యూలు కులాల ప్రతినిధిగాను, ఆ జిల్లాలో షెడ్యూలు జాతుల వారి సంఖ్య నిర్ణీత సంఖ్యకు ఎక్కువగా నున్న పక్షంలో మరొకరిని షెడ్యూలు జాతుల ప్రతినిధిగాను_ఎన్నుకుంటారు. షెడ్యూలు జాతులవారు నిర్ణీత సంఖ్య కన్నా తక్కువగా వున్న పక్షంలో మరో షెడ్యూలు కులానికి చెందిన మరొకరిని జిల్లా పరిషత్‌కు ఎన్నుకుంటారు. ఒక జిల్లా కన్నా ఎక్కువగా ఇతర జిల్లాలలోని నియోజకవర్గాలతో కూడా ఏర్పడ్డ నియోజకవర్గం నుంచి ఎన్నికైన పార్లమెంటు సభ్యుడు తను ఏ జిలాలో నివసిస్తున్నాడో ఆ ఒక్క జిలాపరిషత్‌లో మాత్రమే సభ్యుడుగా వుండాలి.

జిలాపరిషత్‌కు ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు వుంటారు. వీరివి. అనధికార సభ్యులలో నుంచి ఎన్నికైన సభ్యులు ఎన్నుకుంటారు.

జిలాపరిషత్ పరిపాలనా యంత్రాంగం అంతా స్థాయీ సంఘాల ద్వారా సాగుతుంటుంది. ఒక్కొక్క స్థాయీ సంఘం ఈ క్రింది విషయాలను నిర్వహిస్తుంటుంది:_

(1) ప్రణాళికలు, సమాజాభివృద్ధి, రవాణా సౌకర్యాలు.

(2) ఆహారం, వ్యవసాయం, సహకారం, పశుపోషణ, అడవులు, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి.

(3) గ్రామీణ, గృహ, లఘుపరిశ్రమలు

(4) విద్య, వైద్యం, ప్రజారోగ్యం, సాంఘిక సంక్షేమం.

(5) పన్నులు, ఆర్థిక విషయాలు.

పైన పేర్కొన్న అయిదు స్థాయీ సంఘాలు గాక జిలా పరిషత్తు ప్రభుత్వం ఆమోదం పొంది పైన తెలిపిన అంశాలు గాక మరేవైనా ఇతర అంశాలకొరకు ఒకటి లేదా అంతకంటే ఎక్కువ స్థాయీ సంఘాలను స్థాపించవచ్చు. ప్రతి స్థాయీ సంఘం లోనూ సాధారణంగా తొమ్మిది మంది సభ్యులు ఉంటారు. జిలా పరిషత్తు అధ్యక్షుడు, జిలాకలెక్టరు అన్ని స్థాయీసంఘాలలోనూ ఎక్స్‌అఫీషియో సభ్యులుగా వుంటారు. మిగతా సభ్యులను జిలా పరిషత్తు సభ్యులు తమలో నుంచి ఎన్నుకుంటారు.

అభివృద్ధి కార్యకలాపాలను చూ చే జిలా అధికార్లు సమావేశానికి ఆహ్వానించబడినప్పుడు జిలాపరిషత్తు సమావేశంలో గాని లేదా ఏదైనా దాని స్థాయీ సంఘం సమావేశంలో గాని ప్రసంగించడానికే, చర్చలలో పాల్గొనడానికి హక్కు వుంటుంది. అయితే వారికి ఓటు చేసే హక్కు మాత్రం వుండదు.

జిలా సంపూర్ణాభివృద్ధి బాధ్యత జిలాపరిషత్తుపై వుంటుంది. పంచాయతీ సమితులపై జిల్లాపరిషత్తు పర్యవేక్షణ చేస్తుంది.

జిలాస్థాయిలో జిలాపరిషత్తు అన్ని బ్లాకులకొరకు సిద్ధం చేసిన ప్రణాళికలను ఏకం చేసి సమితుల కార్యకలాపాలను సమన్వయపరుస్తుంది. జిలాలోని పంచాయతీసమితుల బడ్జెట్లను పరిశీలించి ఆమోదిస్తుంది. పంచాయతీసమితి ఏర్పడని బ్లాకు విషయంలో పంచాయతీసమితిగా వ్యవహరిస్తుంది. జిలాలో సెకండరీ వృత్తి, పారిశ్రామిక పాఠశాలలను స్థాపించడం నిర్వహించడం లేదా విస్తృతపరచడం కూడా జిలాపరిషత్తు బాధ్యతే. అభివృద్ధి కార్యకలాపాలు మొదలైన అన్ని విషయాలలోనూ ఇది ప్రభుత్వానికి సూచనలు, సలహాలు ఇస్తుంది.

జిలాపరిషత్తు ఆదాయవనరులు ఈ విధంగా వుంటాయి.

(అ) జిలాపరిషత్తుకు కేటాయించిన కేంద్రం లేదా రాష్ట్ర ప్రభుత్వపు నిధులు.

(ఆ) కుటీర పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు, లఘు పరిశ్రమలు మొదలైన వాటి అభివృద్ధికై అఖిలభారత సంస్థల నుంచి గ్రాంట్లు.

(ఇ) ఖాయిలీస్తు, పన్ను లేదా ఫీజు మొత్తాలలో లభించే వాటా.

(ఈ) ఏదైనా చట్టం క్రింద జిల్లాపరిషత్తు విధించే పన్నుల ఫీజుల క్రింద లభించే మొత్తాలు.

(ఉ) జిల్లా పరిషత్తు నిర్వహణ క్రింద వున్న ధర్మాదాయాలు లేదా ట్రస్టుల నుంచి లభించే ఆదాయం.

(ఊ) ప్రభుత్వం కేటాయించిన వెనుకటి జిలాబోర్డు ఆదాయం.

(ఋ) పంచాయితీసమితులు లేదా ప్రజల వద్ద నుంచి ఏదైనా రూపంలో లభించిన విరాళాలు.

(ౠ) ప్రభుత్వం నుంచి ఆమోదం పొంది జిలాపరిషత్తు పంచాయితీసమితుల నుంచి పొందిన విరాళాలు.

తమపై పడిన గురుతరమైన బాధ్యతను నిర్వహించుటకై ప్రజాప్రతినిధులు మిక్కిలి ఉత్సాహం చూపుతున్న విషయం యీ సంస్థలు పని ప్రారంభించిన స్వల్పకాలంలో విదితమైనది. వారి నిర్ణయాల పరిణితియేను, సంయమనమేను "వికేంద్రీకరణ" ఔత్సాహికుల అంచనాను మించిపోయినవి. ఇంత చక్కగా పని జరిగినప్పుడు, యీ సంస్థలకు యెక్కువ పనులను, బాధ్యతలను అప్పగించడమే సరైన సంథా. ఈ యేర్పడిన సంస్థలు నిలిచి వుంటాయనుటలో సంశయం లేదు.



# పొదుపు పాట

శ్రీ కమ్మిశెట్టి

చుక్కాని పరాకు మాని చూచుకో......
దిక్సూచి చిరాకు మాని దిద్దుకో......
పెనుతుఫాను లెగసి చుట్టు ముట్టినపుడు
భీషణోల్బణాలు రేగి ఊపి నపుడు
మునుగుతుంది దరిగానక దారి లేక
నిస్సహాయమైన నీదు జీవనౌక
చుక్కాని పరాకు మాని చూచుకో.......
దిక్సూచి చిరాకు వీడి దిద్దుకో......
దైవానికి మరో పేరు ద్రవ్యము
దానికి రూపాంతరమే దయ్యము

చీకటిలో మసి బారే కొడి గట్టే
జీవితాలు వెలిగించే తైలము
దగాపడకు దిగాల్ పడకు తమ్ముడూ......
నిగావుంచి నిదానించి చూసినడూ........
అపాయాల ఉచ్చులలో చిక్కుకోకు
పరిస్థితుల చెరలో పడి బాధపడకు
నీవే నీజీవితానికి కధినేతవు
నీవే నీ భవిషత్తు నిర్ణేతవు
ఈ నాడే ముందు చూపు చూచుకో......
అదుపుచేసి, పొదుపుచేసి దాచుకో......



# సామాజికులు

**శ్రీ కుంటిమద్ది శేషశర్మ**

అది యొక సినిమా భవనము. అంతర్భాగ మంతయు నధికారి తారతమ్యాను రూపముగ సభ్యులతో నిండియున్నది. సామాజికుల వెనుక భాగముననున్న ప్రసారవరూథము జాలకము నుండి ప్రభాపటలము తోక చుక్కవలె వెలివిరిసి సభ్యుల యెదుట నున్న అచ్ఛాచ్ఛ యవనికపై ప్రసరించి ఛాయాగ్రహముల నిర్మించుచున్నది. తత్కాంతి యష్టికి నెడనెడ నాగరిక విలాస పూరుషుల ముఖనిష్ఠ్యూతములగు నాళికా ధూమములు. సుడులు సుడులై యూర్ధ్వగాములై విద్యుద్వ్యజన వాతాహతములై విశకలితములై వలిపంపు పొరలై భవనాంతఃకుహర సమభివ్యాప్తములైనను నాతిసాంద్రములగుట. వాని ఛాయలు యవనికపై బడి ప్రదర్శన ప్రతిబంధకములు గాలేదు. సభాసదులేకాగ్రతతో తెరవైపు పరికించుచున్నారు.

రావణుడు బహుకాల కఠోర తపః ఫలితముగ సాధించిన మహాత్మ్యపు గర్వము కన్నుగ్రాము మన్ను మిన్ను గానక మన మత్తమాతంగ యూథనాథునివలె రంగ స్థలము కలయ దిరుగు చున్నాడు. ముకుంద పాదారవింద బద్ధానురాగయగు వేదవతి యేకాగ్రతతో తపమాచరించుచున్నది. ఆమెను దాసి తపస్య మాధికి ప్రత్యూహము ఘటించి రావణుడు. "నన్ను చెట్టవట్టి మదన సామ్రాజ్యాభిషిక్తుని గావింపు" మని, "పట్ట మహిషీత్వము గ్రహింపు" మని చాపల్యము ప్రదర్శించు చున్నాడు.

క్రింది తరగతులనుండి. "ఔరా పొగరు పోతా! యేమురా వాణ్ణి" అను పరుష భాషణములు, "ఏమి పోగాలము వచ్చిన దమ్మా వీనికి? బ్రహ్మ వంశము చెడబుట్టినాడు," అను అనుతాప వాక్యములును వెలువడుచున్నవి.

నాగర కమ్మన్యులగు పై తరగతి జనము- "భేష్! ఫలానా వాడు బాగా అభినయించినాడు. ఫలానా స్త్రీ కొత్తగా రంగ స్థల మెక్కినా—అందంగా ఉందోయ్." అనే వాక్యాలు, వ్యాఖ్యానాలు. విమర్శలు, పరంపరగా వెలువడుచున్నవి. "ఏమిటోయి! అతని అభినయం బోరుగొడుతావుంది. వెళ్ళివస్తానోయ్." అని, కాంప్లిమెంటరీ టికెట్టు గ్రహించి సుఖాసనాసీనుడైన గౌరవ సభ్యుడు వెడలిపోవు చున్నాడు కొన్ని పట్టుల.

ఇట్టి సామాజికులలో ఆనందానుభూతి యెవ్వరికి? సమాజమున గౌరవనీయులని వాసిగాంచిన మహా పురుషులకా? పామరులన్న సామాన్య మానవులకా?

ఇంతకు నటీనటులు రంగమున నభినయించుచుండ రాగ ద్వేష శాంతములు ప్రదర్శించుచుండ సామాజికులు ఆనందపరవశులు గానేల? రంగమున పుత్ర శోకమున నందురుచున్న చంద్రమతీ పాత్రధారిణిని పరికించుచు తామును కన్నీటి ధారలను గురియుచు నుద్విగ్న మనస్కులయ్యెను. ఇంట సంసారికము లగు వెతల ననుభవించుట చాలక, మనశ్శాంతికై వినోద ప్రదర్శనమునకు పోయి అచ్చటను దుఃఖమును వెళ్ళబోసికొనుట. అదియు యుక్తమణీయముగ నన్నదని యానందించుటయు నేల? అది రాగముగాని కరుణముగాని ఆనందముగ నెవ్వరికి అనుభవ విదితమగును. ఇతరుల యానందము తమదిగా నెట్లు అనుభవ వేద్యమగును? కాదేని ఏల వీరందరు ప్రదర్శనమునకు పోవుదురు? ఇత్యాదులు విమర్శనీయములు.

నిజమునకు నీవిమర్శలు సామాజికున కనవసరము.

గుండీ నొత్తినంతనే లభించు విద్యుద్దీపపు వెలుగు ననుభవించుట; ఆకాశవాణీ గాన మాధుర్యమునా స్వాదించుట గృహస్థుని వంతు. అది యెట్లు వచ్చినది? దీపము వెలుగునకు గుండీ వత్తుటకు నేమి సంబంధము? గ్రాహక ప్రసారిత గానమునకు దాని మర త్రిప్పుటకు నేమి పొత్తు? ఇంతవరకు నావెలుగు, ఆ గానము ఏల స్తబ్ధమై యుండినది? వీనికి విదాన మెయ్యది? ఇత్యాది మీమాంస గేస్తునికి సంబంధించినది గాదు. అది విద్యుద్యాంత్రిక క్రియావిదగ్ధుని వంతు అటులనే ప్రదర్శనములు అభినయ కుశలురచే ప్రదర్శితములేని సామాజికులు తన్మయులై ఆనంద మనుభవింతురు. కాదేని చీదరించు కొందురు.

ఆ యానందానుభవమునకు అభినేతల వైదగ్ధ్యమేగాక సామాజికులకు తన్మయీ భవనయోగ్యత యుండవలయును. ఆ తన్మయీభవనమునకు నాగరకత కార్యకారణ విమర్శనాజ్ఞానమును లోకానుభవమును కొంత ప్రతిబంధకములు. పసిబాలురు, ఏదేని పులివేషము ఆడుచున్న, తప్పెటలు మ్రోగుచున్న, ఆ దరువుల కనుగుణముగ నా పులివేషముతోబాటు తామును చిందులు ద్రొక్కుట గమనించుచున్నాము. ఒక్క వెదురు కర్రను తొడల నడుమ నిరికించుకొని, ఎద్దుల నదలించినట్టు ధ్వనిచేయుచు, తాము ముందుకుపోవుచు నిద్రాహారములు మాని విహరింతురు. వారిని చూచి పెద్దలు ఏమిటీ చేష్టలు అని తిరస్కరింపవచ్చును. తమకు వానియెడ తన్మయత కలుగదు. కలగక పోవచ్చును.

వీరే యొక బాడ్మింటన్ లేక క్రికెట్టు, కాదేని గుఱ్ఱపు పందెములు జరుగు ప్రదేశమునకుపోయి, ఆడువారాడుచున్నను, తాము గట్టున నుండియు, తామే ఆడునట్టు, తామే గెలిచినట్టు ఆనంద పరవశులగుట గమనించుచున్నాము. ఏ బొంబాయిలోనో కలకత్తాలోనో క్రికెట్టుపోటీలు జరుగుచుండగా దాని వ్యాఖ్యానములను తమ యింటి రేడియో రిసీవరు గుండ ప్రసరించుచుండగా విని తదేకాసక్త చిత్తులయి తత్తత్కాలానుగుణ హాహా నినాదముల నొనరించుట క్రొత్త గాదు. ఆ యాటలందు ఉత్సుకత లేనివారు ఈ శ్రోతలను గాంచి "వీరికిదేమిపిచ్చి" అని ఈసడించుటయు కలదుగదా!

తర్కవితర్కములు నూహాపోహలు విజ్ఞానము నభివృద్ధి జెందుకొలది తన్మయీభవనానుకూల్యము కొఱత వడుచుండును. కావుననే—

"నశబ్ద శాస్త్రాభిరతస్య మోక్షః నచైవరమ్యా వసథ ప్రియస్య॥" అని యభియుక్తోక్తి. మోక్షము దుఃఖగంధానావిలమగు నానందమునకు కారణము. అయ్యది శబ్ద శాస్త్ర బద్ధాదరునకు నలభ్యమట. కారణము. ఇతనికి శబ్ద స్వరూప సాధుత్వా సాధుత్వములపైననే యోచన. ఇతరములందు మనసుపోరదు. లౌకిక విషయవాంఛగలవానికి పారమార్థిక చింతలకు నెంతదవ్వు? అందుచే శబ్ద శాస్త్రాభిరతునికి మోక్షములేదనిరి. ఇది యుపలక్షణము. శబ్ద శాస్త్రము నందువలెనే తర్క జ్యోతిష గాంధర్వ చిత్రలేఖనాది విషయములందును వ్యసనము గలవానికి పరబ్రహ్మానంద సంధాయకమగు మోక్షమలభ్యము.

రసానందమును పరబ్రహ్మ సధ్రీచీనము. అది యనుభవగోచరము గావలయునన్న, యోగి పరమాత్మ ధ్యానసమాధి నిష్ఠుడైనట్లు సామాజికుడును తన్మయుడు గావలయును. ఆ తన్మయీభావమునకు ఈ చదువులు పరులేమనుకొందురో అను బాహ్యజ్ఞానము నాటంకములు.

విమానము రోదోంతరమునకు బోవలయువిన భూమ్యాకర్షణ శక్తి ప్రతిబంధకము దాని నతిక్రమించు వేగాతిశయము గలిగిన గాని గ్రహవేది గమ్యము చేరఁజాలదు. అటులనే విజ్ఞానులగు సామాజికులకు బాహ్యజ్ఞానము తొలగించి తన్మయీభావమాపాదింపవలయునవిన నటకులకు నటనా సామర్థ్య ముండవలయును. వాచికాంగికసాత్వికాహార్యాభినయములు పాత్రానుగుణముగ నుండ వలయును. అంతియగాక పలుసినిమాలయందు నాయక పాత్రధారి యొక్కడే యుండిన, "వతడే యితడ"ను ప్రత్యభిజ్ఞ పాత్రమున తన్మయీ భవనమునకు ప్రతిబంధకము ఆహార్య వేష భూషాదుల తత్ప్రతిబంధక నివారణ ధూర్వహములైనగాని తన్మయీ భావము సుకరముగాదు.

ఇంతటి ప్రతిబంధక సామగ్రియున్నను ఆనంద పరవశులగు నాగరకుల ప్రశంసయే పాత్రధారికి గౌరవా పాదకము.

మరి యీ సామాజికులు ఆనంద పరవశులగుటకు హేతువేది? ఆనంద పరవశు లగుచున్నారనుట యథార్థ విషయము. కాదేని పని పాటలువదలి ధన కాలవ్యయమునోర్చి ప్రదర్శనశాలల కేగుట సంభవింపదు.

కావున ననుభూయమాన ఫలాను పారము కారణము కల్పించవలయును. ఏతాదృశ మీమాంస రెండువేల సంవత్సరములకు పూర్వమే బయలు దేరినది. భరతముని తద్విషయము సమ్యగ్దృష్టి పర్యాలోచించి రస సూత్రమును నిర్వచించినాడు.

"విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అని నాటినుండి నేటి వరకుగల యాలంకారికులు పలువిమర్శనము లొనరించి పూర్వ పూర్వ మతములయందు దోషములను పరిశీలించియు పై భరతముని సూత్రమునకే నూత్న నూత్న వ్యాఖ్యానముల నొనరించిరి. భట్టలొల్లటుడు దొడంగి పండితరాజు జగన్నాథుని వరకు పలుపురు పలుతెఱంగుల విమర్శించి ఎన్ని యాక్షేపణల నొనరింపవచ్చునో యన్నింటిని లేవదీసి, వాని కన్నింటికిని సమాధానములను వాకొని ప్రతిపక్షుల వాయిమూయించి రససిద్ధాంతమును నిర్వచించిరి. వానిని పరికించితిమేని సామాజికులు ఆనందపడుటకు ఉపపత్తి విశదమగును.

భరతముని నాటకీయ రసమునకు లక్షణము నిర్వచించెను. దానినే అనంతరలాక్షణికులు శ్రవ్య కావ్యమునకు సమన్వయించిరి.

రసమానంద స్వరూపము. దానిని పొందు వాడానందించు చున్నాడు. "రసో వై సః రసగ్ంం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అని శ్రుతి.

నాటకమునందు రసాశ్రయులని యూహ సేయుటకు ఆస్పద మైన వారు ముప్వురు. నాయికా నాయకులు. వీరు అను కార్యులు. నటకులు. వీరే అను కర్తలు. సామాజికులు ప్రేక్షకులు. ఈ ముప్వురియందు నిజమునకు నాయికా నాయకులకే పరస్పరాను రాగము. అదియ శృంగారమునకు స్థాయిభావము.

స్థిరమైనది స్థాయి. మనస్సునందు అనేక భావము లుద యించు చుండును. కొన్ని పుట్టినవి పుట్టినట్టుగానే అంతరించును. అంకురించినకొన్ని భావములతో ఢీకొని యణగారును.

"ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః
బాల్యేవై దగ్ధ్య దగ్దానాం కులస్త్రీణాం కుచావివ."

"పుట్టుచున్నవి హృదయాన పుట్టినట్టె యడగుచున్నవి పేదల యాశయములు * చిన్నతనమున తలచెడియున్నయట్టి కొలము జవ రాలికెదర్రాలు గుబ్బలట్లు"

* ( ఈ పద్యము ఉత్తరార్థము శ్రీమాన్ పుట్టపర్తి శ్రీని వాసా చార్యులది. తత్పూర్వార్థము ప్రస్తుతము స్ఫురింపక అన్యము సంకలితము.)

పై విధముగ పేదల తప్పులవలెగాక సజాతీయ విజాతీయ భావాభిహతము గాక యుండుట భావమునకు స్థాయిత్వము.

"సజాతీ యైర్విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయీ భావ ఉదాహృతః॥"
(దశరూపకము)

రసరూపముగ పరిణతినొందు పర్యంతము విచ్ఛిన్నముగాని భావ మునే స్థాయీ భావమందురు. భావము లనేకములైనను రసములు తొమ్మిదని భావించినందువలన స్థాయీ భావములను తొమ్మిదిగానే నిశ్చితము.

"శృంగార మొక్కటే రసమని" శృంగార ప్రకాశ కారుడు. "ఏకోరసః కరుణఏవ" అని భవభూతి. "శాంతవర్జ మష్టరసములు" అని ధనికుడు.

"శాంతస్యశమ సాధ్యత్వాత్ నటేచతద సంభవాత్।
అష్టావేవ రసానాట్యేన శాంతస్తత్ర యుజ్యతే॥"

రాగద్వేషాది గ్రస్తుడగు నటునకు శమ సాధ్యమగు శాంత మునకు ఎక్కడి పొత్తు. కావున నాటకమున శాంతము లేదు. ఎని మిదిరసములే నట. నిజమునకు నటుడు అభ్యాసముతో తనకు లేని రాగమును ప్రదర్శించినట్లే శాంతమును ప్రదర్శించు టలో బాధకము లేనందున "శాంతోస్తి నవమో రసః" అని మమ్మట భట్టు.

"అష్టావేవ రసానాట్యేష్వితికేచి దచూచుదన్।

తదచారు యతః కంచిన్నరసం స్వదతేనటః" "సంగీత రత్నాకరము" కావున నాటకమునందును శాంతమునకును రస త్వము అంగీకృతము. ఇంతియగాక కాంతా విషయక రతి రసమగు నన్నట్లు భగవద్విషయక రతియు రసమయి భక్తిరసమును నొక్కటి యుండనీ యని శంకించి, యనవస్థను తొలగించుటకు భరతముని వచన ప్రామాణ్య మాశ్రయించి నవరసములే యని పండితరాజు నిర్ణయించెను. అందు—

"స్త్రీ పుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యః చిత్తవృత్తి విశేషోరతిః స్థాయీభావః" అని పండితరాజు.

అది పెంపొంది రస శబ్ద వాచ్యమగుచున్నది.

కావున నను కార్యులే రసాశ్రయు లనవలసియున్నది. ఐన నా యికా నాయకుల కానందము జనించుగాక. దాని వలన సామాజికు లకేమి లాభము. వీరికేమి పరిదృశ్యమాన నాయికా విషయకాను రాగము లేదుగదా! వీరెల నాటకములకు పోవలయును? ఆనంద మేల పొందుచున్నారు? అను ప్రశ్న ముదయింపక మానదు,

దానికి లాక్షణికు లొక్కొ రొక రొక విధముగ సమాధాన మిచ్చిరి. "రసము అనుకార్య నిష్ఠము. అనుకర్తలగు నటులు నైపుణ్యాతిశయముచే ప్రదర్శించిన యభినయము కొలది వారి యందు భాసించిన రతి, వారే అను కార్యులని భావించిన సామాజి కులయందు స్ఫురింపుచున్నది." అని భట్టలొల్లటుడు. అతని మతా నుసారము, "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అను సూత్రమునగల సంయోగ నిష్పత్తి పదములకు, రసము విభావములచేత జన్యము అగుటచే పుట్టుచున్నది. అనుభావము లచే గమ్యమగుటచే వ్యక్తమగుచున్నది. వ్యభిచారి భావములచే పోష్యమటుటచే పుష్టమగుచున్నది అని.

ఇందు అనుకార్యులయందున్న ఆనందము అనుకర్తయందు నట్లు తోచవచ్చును గాని, అంతమాత్రముచే సామాజికులు ఆనంద మనుభవించుటకు హేతువు మృగ్యము.

శ్రీ శంకుకుడు:_అను కార్యులేనాడో గతించిరి. ఇపుడనుభ వింపబడుచున్న రసమునకు కాలాంతరీతులగు వారెట్లు ఆశ్రయు లగుదురు? కాన నటుడే రసాశ్రయుడు. నట ప్రదర్శితములైన విభావాదులచే నటునియందు సామాజికుడు రసమును అనుమానించి ఆనందించుచున్నాడు. అని యొక్క అడుగు ముందుకు వైచెను.

భట్టనాయకుడు:_ అను కార్యులైన లౌకికులగు నాయికా నాయకులకు గల్గు ప్రేమ తన్నిష్ఠము: తన్మాత్రానంద సంధాయకము. వారు పూర్వకాల మెప్పుడో యుండినవారు. వారి యనురాగము ప్రకృతమున కకించిత్కరము. ఆనందించువారు సామాజికులు గావున వారే రసాశ్రయములు అని రాద్ధాంత మొనర్చెను.

అట్లు రసము సామాజిక నిష్ఠమేని ప్రదర్శింపబడు శకుంతలాదుల విషయకమగురతి సామాజికుల కున్నదా? అని శంక పొడముచున్నది.

అందుకు సమాధానము:_

కావ్యమున శబ్ద ప్రతిపాద్యలగు శకుంతలాదుల యందు, నాటకమున నటకాభినయ సన్నిధాపిత శకుంతలాదులయందు సామాజికునికి, అట్టి దుష్యంతాదుల యెడ ప్రేక్షకురాలికి అనురాగో దయమెట్లు? అను విషయము పండిత రాయలచే నిపుణమున పరామృష్టము.

"భట్టనాయకాస్తు తాటస్థ్యేన రసప్రతీతావనాస్వాద్యత్వం, ఆత్మగతత్వేన ప్రత్యయోద్ధుర్ఘటః, శకుంతలాదీనాం సామాజికాన్ ప్రతి అవిభావత్వాత్, వినా విభావం అనాలంబనస్య రసాదే రప్రతిపత్తేః" అని.

ఎవ్వనికో ఎక్కడో రసనిష్పత్తి యున్నంత తనకేమి లాభము? తనకు రసావిర్భూతి కలిగినదనరాదు. "స్త్రీ పుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్యః చిత్తవృత్తి విశేషః రతిః స్థాయి భావః" అనిగదా లక్షణము. కావ్య నాటక సన్నిధాపిత శకుంతలా విషయకమగు ప్రేమ తనకు లేదుగదా! అటులనే తాదృశ దుష్యంతుడు ప్రేక్షకురాలి ప్రేమకు ఆలంబనము గాదుగదా! రతికి ఆలంబనమే లేని తఱి రసోత్పత్తి యెట్లు? అని ప్రశ్నించి. సామాజికులకు శకుంతల రత్యాలంబనముగాకున్నను ఆలంబన సాధారణమైన స్త్రీత్వము అందుగలదుగదా! ఒకవేళ శకుంతలా వేశమును పురుషుడే ధరించినను స్త్రీత్వము వేషభూషలచే ప్రదర్శింపబడుచున్నదిగదా! కాన రసోత్పత్తికి "ప్రతిబంధకమేమి?" యని ఎదుర్కొన, అట్లయిన సోదరి యందును స్త్రీత్వమున్నది గాన రత్యాలంబనము గాని, అట్లు గాదు. రాగోత్పత్తికి ప్రతిబంధక ముండరాదు. అంతియగాక ఈమె యభిగమ్య యనుజ్ఞానము గల్గుటకు అనుకూల్యముండవలయును. అట్టిచోటనే రత్యుత్పత్తి. కాన కేవల స్త్రీత్వము కార్యకారి గాదు. కావ్యాభినయ సన్నిధాపిత శకుంతలాదులయందు కేవల స్త్రీత్వమే గాక దుష్యంత పత్నీత్వ రూప శకుంతలాత్వమును జ్ఞానగోచరమగుచున్నది. సామాజికుల యనురాగోత్పత్తికి నది ప్రతిబంధకము.

"ఈమె శకుంతల" యను జ్ఞానమున్నను అనురాగము జనింపవలయుననిన, తాను దుష్యంతుడను భావమేర్పడిన గాని యదిగలుగదు. అటులనే తాను శకుంతలయను జ్ఞానమున్ననే ప్రతీయమానుడగు దుష్యంతుని యెడ ప్రేమోత్పత్తి. తాను నవీనుడు సామాన్య మానవుడు. అతడు ప్రాచీనుడు ధీరోదాత్తుడు. ఆమె అప్సరఃపుత్రి ఇత్యాది జ్ఞానము తనయందు దుష్యంతా భేద బుద్ధికి_శకుంతలా భేద భావనకు_ప్రతిబంధకము.

ఐనను అనుభవింపబడుచున్న ఆనందమునకు అనుకూలముగ కార్యకారణ కల్పన మావశ్యకమైనపుడు, భట్టనాయకుడు:_

"అభిధావ్యాపారముచేత కావ్యమందును, అభినయముచేత నాటకమునందును బుద్ధి గోచరులగు శకుంతలా దుష్యంతాదులు, భావకత్వ వ్యాపారముచేత రత్యుత్పత్తి ప్రతిబంధకమగు శకుంతలాత్వ దుష్యంతత్వారూప విశేష ధర్మములు తొలగిపోయి, రసానుకూలములైన కాంతాత్వాది సాధారణ ధర్మమాత్ర విశిష్టులుగా భాసింతురు అందుచే సామాజికులకు ఆనందానుభవము." అని సిద్ధాంతీకరించెను

పండితరాయలు:_

"సహృదయులు ఔచిత్యదూరములుగాని లలిత సన్నివేశములతో రమణీయములగు కావ్యములను వినుచున్నారు. నటనా చతురులగు నటకుల యభినయములగనుచున్నారు. తచ్ఛ్రవణముచే తద్దర్శనచేవారికి శకుంతలాద్యనుకార్యులు బుద్ధిగోచరులగుచున్నారు. వారిసహృదయతచేత సంస్కృతమగు భావనాపాకముచేత సబుద్ధి గోచరులగు శకుంతలాదులయందు దుష్యంతపత్నీత్వాదిరస ప్రతిబంధక ధర్మములు మరుగుపడుచున్నవి. ప్రతిబంధక నివృత్తి

చేత సాధారణులైన ఆలంబన కారణములగు కాంతాదులును, వెన్నెల మొదలగు నుద్దీపన హేతువులును, అశ్రుపాతాది కార్యములును, చింతాదిసహకారులును కలిసి సమిష్టిగ నేర్పరచిన యలౌకిక వ్యాపారముచేత సామాజికులకు ఆనందమునకు ఆచ్ఛాదనమగు అజ్ఞానము తొలగుచున్నది. ఆ యజ్ఞానావరణ భంగము చేత సామాజికులయందు అనాదిగా వాసనా రూపముగనుండిన రత్యాదులు ప్రకాశమానములై అనుభూతుమానములగుచున్నవి. అవియె రసములు. అని నిర్వచించెను.

ఏతావతా సర్వప్రాణి సహజములగు రాగ ద్వేషాదులు వాసనా రూపముగ సర్వసామాజిక హృదయములందును గలవు. కావ్యశ్రవణ నాటకదర్శనాదులచేత భావగోచరమైన నాయిక యందు, లేక నాయకునియందుగల యసాధారణత్వము భావనా విశేషముచేత తొలగి వారు సాధారణులు కాగా తద్విషయకముగా తదీయహావభావాదులచేత సామాజికులయందు వాసనారూపముగ నున్న రత్యాదులు పరిపుష్టములై రసాత్మకములై చర్వణావిషయములగుచున్నవి. అందువల్లనే సామాజికులకానందము, దర్శనాపేక్ష, తన్మయత, తామే యనుభవించుచున్నట్లా వేశమును ఉపపన్నము.

"ఈ ఆనందము లౌకికము అలౌకికము అని రెండు విధములు" అనిరి. లౌకికానందము సాక్షాన్నాయకనిష్ఠము. పరస్పరానురాగమునకు పరస్పరము ఆలంబనము. వారి గుణములు చేష్టలు సింగారములు తటస్థములైన చంద్రాదులు నా యనురాగమునకు ఉద్దీపన కారణములు.

ఆలంబనగుణశ్చైవ తచ్చేష్టా తదలంకృతిః
తటస్థశ్చైవ విజ్ఞేయ శ్చతుర్థోద్దీపనక్రమః
అవి ఉద్దీపనములు నాల్గు విధములనిరి.

ఇవి లౌకిక స్త్రీ పురుష గతములైన ఆలంబన కారణములు, ఉద్దీపన కారణములు కార్యములు అని వ్యవహరింపబడును. అవియేకావ్య నాటకగతములేని ఆలంబన విభావములు, ఉద్దీపన విభావములు అనుభావములు అని వ్యవహరింపబడుచున్నవి.

"కారణాన్యథకార్యాణి సహకారీణి యాని చ
రత్యాదేః స్థాయినో లేకే. తాని చేన్నాట్య కావ్యయోః
విభావాశ్చానుభావాశ్చ కథ్యంతే వ్యభిచారిణః" అని
లౌకికమైన రతి ఒకప్పుడానందమును మరొక్కతఱి
విషాద గలిగింపవచ్చును.

"ఇయంగేహే లక్ష్మీరియ మమృత వర్తిర్నయనయోః
అసావస్యా స్పర్శోవపుషి బహులశ్చందన రసః॥"
అంటాడు రాముడు సన్నిధానవర్తినియగు సీతను గూర్చి.
(నానిలయంబు లక్ష్మియిది, నానయనామృత మీమెతాఁకునా
మేనినలందు చందనము, మేలగు ముత్తెపుదండ నామెడం
బూనిన యీభుజంబు తనువున్నను నీమెకు జెందినట్టిదే
దైనను, గావి యీమె విరహంబు భరింపనశక్యమెంత
యున్"॥)

అని యుత్తర రామ చరిత్రమున సీతా ప్రేమాను విద్ధ దగు రామ రూపాను కార్యునికి సతీ సన్నిధానమున నానందము గల్గినను, తద్విరహము వేదనాకరము

మనోరోగస్తీవ్రో విషమివ విసర్పన్న విరతం
ప్రమాథీ నిర్ధూమం జ్వలతి విధుతః పావక ఇవ
హినస్తి ప్రత్యంగం జ్వరఇవ గరీయానితఇతో
నమాంత్రాతుకితాతః ప్రభవతి నచాంబానభవతీ॥

మాధవాసక్త చిత్తయగు మాలతి తత్సంయోగమునకు పూర్వము అభిలాష రూప విప్రలంభము ననుభవించుచున్నది. ఇచ్చట ననుకార్యయగు మాలతికి మాధవాలంబనమైన యను రాగము విషమువలె నిర్ధూమాగ్నివలె జ్వరమువలె సంగాంగములను బాధించుచు వేదనాజనకమగుచున్నది.

"యద్విస్మయస్తిమిత మస్తమితాన్యభావ.
మానందమంద మమృత ప్లవనాది వాసీత్
తత్సన్నిదౌ; తదధునా హృదయం మదీయ
మంగార చుంబిత మివవ్యథమానమాస్తే॥"

మాలతీ సన్నిధానమున తదీయాతి లోక సౌందర్య వీక్షణమున ఆశ్చర్య నిష్పందమై ఇతర విషయములకు చొఱక అమృత సాగర తరంగా ప్లావితమువలె నానంద తుందిలమైన నాహృదయము తద సన్నిధానమున మండు కొఱవి చూడినట్లు వేదన పడుచున్నదని మాధవుడనుచున్నాడు. దీనినే భంగ్యంతరముగా,

"పచ్చక్ఖ సొక్ఖ దాయిణో పరొక్ఖ దుక్ఖదూసరా సజ్జన సమాఅమాహోంది " అనుచున్నది లవంగి.

సజ్జనుల సంగతి ప్రత్యక్షమున సౌఖ్యమును పరోక్షమున దుఃఖమును గలిగించునట.

కావున లౌకికులైన యనుకార్యులకు రతి సుఖ విషాదము లను కాలానుసారము కలిగింపవచ్చును. కాని సామాజికులకు గలుగు రతి లౌకికముగాదు. భావనా విశేషముచే సాధారణీ కృత మగు నాలంబన విషయకముగాన అలౌకికమై కేవలానందమునే గలిగించును. కలిగించు ననుటకు రసిక హృదయానుభవమే ప్రమాణము. కాదేని విప్రలబ్ధ శృంగార కరుణరస ప్రధాన కావ్య నాటక శ్రవణ దర్శనములకు ప్రవృత్తి దుర్ఘటము.

కనుకనే విద్యానాథుడు ప్రతాపరుద్రీయమున

"గుణాలంకార శ్రీకృత పరికరోద్భావ విభవః
స్ఫురత్ప్రా దుర్భావః క్రమగళిత వేద్యాంతరమతిః
సుఖంవాదుఃఖంవా విదధయతు యూనోః సహృదయే
త్వమందానందాత్మా పరిణమతి పూర్ణో రసభరః॥"

అని వాకొనెను.

రత్యాది స్థాయిభావము, శ్లేషప్రసాదాది గుణముల చేత, నుపమా రూపకాద్యలంకారములచేత, వైదర్భ్యాది వృత్తులచేత, కైశిక్యాది రీతులచేత సుశోభితమగు కావ్యముచేత ప్రతిపాదితమై క్రమముగ పరిపుష్టమగుచున్నది. క్రమముగననిన,—

కావ్యాభి నయావిష్టుడగు సామాజికుడు శబ్దసన్నిధాపిత—లేక—అనుకర్త యెడ శకుంతలాది అనుకార్య దృఢబుద్ధి యుక్తుడగును.

కనుపించు నటనియెడ ననుకార్యబుద్ధి కుదురు ననుటలో సందియములేదు. చిత్తవృత్తి యట్టిది. భావనా విశేషముచే నొక్కటియొక్కటిగా తోచుననుటకు

"వానిఁగలలోనఁగాంచని వనజముఖియు
వాని మార్పునఁబేర్కొని మానవతియు
వానిగా నాత్మభావించి పరునిఁగవయ
నప్పళింపని సతియు లేదయ్యెనచట."

అను శ్రీనాథుని పద్యమే ప్రమాణము. ఆహార్య వేష భూషలు లేకనే యాత్మవరుని నటునిగా భావించి సంగమించిరనిన అవి గలిగినప్పుడు తద్భావనకు బాధకమేమి యుండును? భావనాతిశయముచేత సామాజిక అనుకార్య హృదయములకు అభేద జ్ఞానమును సంభవించును. ఆపై సామాజికుల హృదయము వృత్త గీతాది నానావిధ నాట్య ధర్మములయందు మగ్నమగును. అటుపై ఇతర విషయములగు చింతలు తొలగును. అనగా ప్రక్కన నుండు వారెవ్వరు? తమహావభావ విలాసములను గాంచి వారేమను కొందురు అను బాహ్యజ్ఞానముతోబాటు అను భూతుమాన విషయ వివేకమును గళితమగుచున్నది. అట్టితఱి అలౌకికమై యోగివేద్య మగు బ్రహ్మానంద సధ్రీచీనమునగు రసానందము అనుభవ విదిత మగుచున్నది.

ఇచ్చట కుమారస్వామి సోమపీథి వ్యాఖ్యానించుచు రత్నాపణమునందు రసానందమునకు బ్రహ్మానందమునకు భేద మిసుమంత వాకొనెను. బ్రహ్మానందము నందు వేద్యాంతర మేమియు నుండదు. "సర్వంబ్రహ్మ" అను అద్వైతానుసారము అనుభవించు తాను అనుభూతుమాన బ్రహ్మము తద్విషయజ్ఞానము జ్ఞానానుభూతి అనున వేవియు స్ఫురింపవు. రసానుభవమునందు పూర్వము వాకొనిన బాహ్యవిషయములు స్ఫురింపకున్నను విభావాదులు స్ఫురించు చుండును. ఐనను ద్రాక్షా మధూక కాశ్మీర కర్పూర జంజీర రస మిశ్రితపానక రసన్యాయమున సర్వమిశ్రితముగ స్ఫురించును. ఇది బ్రహ్మానంద రసానందములకు తారతమ్యము అని.

ఇక మోక్షమునందును బ్రహ్మవిషయకానందము ననుభవించు తాదృశజ్ఞానముగల జీవుడును ప్రత్యేకముగ భాసించు విశిష్టాద్వైతమత సిద్ధాంతానుసారము పరబ్రహ్మము చిదచిద్విశిష్టముగాన తన్మతానుసారము బ్రహ్మను భవమునందును విషయాంతర భానముగలదు. అట్టి చో నామతానుసారము అనుభవముంత భేదము గూడ రసబ్రహ్మానందానుభవములకు లేదు.

ఇట్టి రసము లౌకికులగు యువతీయువకులకు సుఖదుఃఖ సంధాయకమైనను గుగాక. సామాజికునకు కేవలానందమునే కలిగించును

కేవలానందదాయకమగు నలౌకిక రసానుభూతి అనుకార్యులగు రామాదులకు లేదు. నటనాబద్ధ దృష్టియు తప్పంగ భీమపునగు అనుకర్తలు—నటునకును లేదు. కేవలము సామాజికునికే గలదు.

సామాజికాదిరేవాస్య రసస్యాశ్రయ ఉచ్యతే.
రసస్య వర్తమానత్వాత్ నానుకార్యస్య సంభవః ।।
అనుకార్యస్య రామాదేః కాలాతిక్రమ దర్శనాత్ ।
నాతిక్రాంతానుకార్యస్య రసోద్భావనయా కవిః
బధ్నాతి కావ్యం యత్తస్మా ద్రసస్సామాజికాశ్రయః ॥
అని శారదాతనయుడు.

అనుభూతుమానమగుచున్న రసమునకు ఏనాడో లోకము విడచిపోయిన రామాదులెట్లు ఆశ్రయులగుదురు. ఎన్నడో గతించిన

అనుకార్యుల ఆనందమునకు కవికావ్యము నిబంధింపదు. నాటకము ప్రదర్శింపబడదు. కావున సామాజికుడే రసాశ్రయము.

నిర్వేదాద్యుపభోగభావితనిజా స్వాదాతిరేకోరసో
లోకేస్యాదను కార్య ఏవకథితో నాట్యేతు సామాజికే

రత్యాశ్రయ ప్రత్యక్షమునందు సుఖమును పరోక్షమున దుఃఖమును కలిగించు లౌకిక రసమునకు అనుకార్యులగు రామాదులేయాశ్రయము. విభావాది పరిపుష్టమగు నలౌకికరసమునకు సామాజికులే యాశ్రయము.

ఈ రసానుభవమునందు సహృదయమునకు భావనా విశేషముచే ననుకార్యాభేదబుద్ధి కల్గుచున్నదని గమనించితిమి. అందు నను ఆయా వ్యక్తి లింగవయోగుణానుగుణముగ నాయాపాత్రలతో డనభేద భావన గల్గును.

శకుంతలా నాటక దర్శనమున యువకులకు దుష్యంతాభేద బుద్ధియు యువతులకు శకుంతలా భేద భావనయు గల్గి యానందింపవచ్చును. వరూధినీ నాటకమున వరూధిని—

పాటునకింతులోర్తురె కృపారహితాత్మక నీవు త్రోయని
చ్చోట భవన్నఖాంకురము వోఁ కెఁగనుంగొను మంచుఁ
జూపినన్.

ఆమెను నిరాకరించు ప్రవరునితో శాంతమనస్కుడు ధర్మ పారాయణుడునగు సామాజికునకు అభేదభావన గల్గినను,—

"ఏమిటీ చాదస్తుడు. సశరీర స్వర్గసుఖము సమకూరినను నిరాకరించిపోవుచున్నాడే" యని చింతించుచు, "దొరకు నవకాశమును జారపిడువని సామాజికునకు తదభేదభావనగల్గదు." నేను గనుక ఆస్థానమున నుండిన అట్లు వరూధినిని వెతలపాలొనరింతునా" అనుమాయాప్రవరునితో నభేద భావన గల్గును

"అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వం"

అని పండితరాయలు. విభావాదుల యందనౌచిత్యము లోకమువలన తెలియదగినది. ఏకత్రానురాగము కాంతకు బహునాయకానురాగము అనుచితత్వమని ఆలంకారికులు

వరూధినికి మాత్రము ప్రవరుని యెడ రతియున్నను ప్రవరునికి వరూధిని యెడ రతిలేదు. గాననిది రసాభాసము, అట్టిచో ధర్మావిష్ట మనస్కులకు ప్రవరతాదాత్మ్య బుద్ధి గల్గినను, రంభా రావణ సంభాషణ ఘట్టమున,—

ఎవ్వరిదానవే జలరుహేక్షణ యెయ్యెది పేరు తెల్పవే
జవ్వని యెవ్వనిందలచి చయ్యనఁబోయెద వేమిటారి నీ
జవ్వనమున్ విలాసమును జక్కదనంబును నీటుఁజూచినన్
బువ్విలు కానికైన భ్రమపుట్టుఁగదే భవనైక మోహినీ.

కొప్పొక చేతఁబట్టి మది కోరిక తీరిక తెత్తఁదేనియల్
చిప్పిలు మోవిఁగ్రోలి నునుజెక్కిలి నొక్కుచు గుబ్బ
లంటుచున్
గప్పురపీడెమిచ్చి తమకంబున నీవివదల్చియంతనీ
గొప్పపిఱుందుపై నొలసికూడిన మేటికి స్వర్గమేటికిన్.

అని యురవడించుచు రంభపైఁ గలియ నుంకించు రావణునితోటి తాదాత్మ్య భావన సామాజికునకు సంభవింపదు. అట్టియెడ దుండగీని దుశ్చేష్టలను గాంచి వారింపఁజేతగాక శాపార్ధములను గుమ్మరించుచు మరుగున నడగియున్న సాధువులతో తాదాత్మ్య భావన గల్గును

ఈ విధముగ సామాజికులు రసానందమనుభవింపవలయునన్న నటుని చతుర్విధాభినయ కౌశలము సామాజికునికి తన్మయీభవన యోగ్యతయును కారణములు. జితేంద్రియులు యోగులు మనస్సు నరికట్టి ఇతర విషయములకు బోనీక బ్రహ్మాసక్తులైనట్లు కొందరు త్వరగా తదాసక్తులు గాగలరు. ఇతరులు చంచల మనస్కులు. నాయానందము పొందలేరు. వారికి అనుకర్త రావణుడుగా గాక నటుడుగానే—వ్యక్తిగానే కన్పించును వారి యానందమును అంతియ.



# ప్రభుత్వ నిర్ణయాలు

వచ్చే విద్యా సంవత్సరంలో ఉచిత మధ్యాహ్న భోజన సౌకర్యాన్ని రెండు లక్షలమంది ప్రాథమిక పాఠశాలల పిల్లలకు కలిగించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. ఇందు కవసరమైన దుంపనూనె, మొదలైనవాటిని కేర్ సంస్థ రాష్ట్ర ప్రభుత్వానికి సరఫరా చేస్తుంది ప్రథమ దశలో నాలుగేళ్ళపాటు అమలు జరిగే ఈ పథకానికి 5.6 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. ఈ పథకం నిర్వహణకు రాష్ట్ర ప్రభుత్వం ప్రతియేటా 10 లక్షల రూపాయల మేరకు మాత్రమే బాధ్యత వహిస్తున్నది.

వచ్చే విద్యా సంవత్సరంలో ఈ పథకంవల్ల తెలంగాణా ప్రాంతంలోని 1,50,000 మంది ప్రాథమిక పాఠశాలల పిల్లలకు, ఆంధ్ర ప్రాంతం శ్రీకాకుళం, విశాఖపట్నం, పశ్చిమగోదావరి, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని 50 వేలమంది పిల్లలకు లాభం చేకూరుతుంది. యునిసెఫ్ సంస్థ అధ్వర్యాన గల ఒక పథకం క్రింద రాయలసీమలలోని రెండులక్షలమంది ప్రాథమిక పాఠశాలల పిల్లలకు ఉచితంగా పాలు ఇవ్వబడుతున్నవి

ఈ పథకాన్ని ప్రాథమిక పాఠశాలాధిపతులద్వారా ప్రభుత్వం ప్రత్యక్షంగా నిర్వహిస్తుంది పథకం పర్యవేక్షణకు అవసరమైన చోట్లలో తల్లిదండ్రుల సంఘాలను ఏర్పాటు చేస్తారు. మాధ్యమిక, ఉన్నత పాఠశాలలలోని ప్రాథమిక తరగతులకు కూడా ఈ పథకం వర్తిస్తుంది.

* తెలంగాణా ప్రాంతంలో ఏప్రిల్ 1వ తేదీనుంచి అమలులోకి వచ్చిన 20 శాతం విద్యుత్ సరఫరా కోత, క్లినిక్‌లకు, నర్సింగ్ గృహాలకు, వైద్యసంస్థలకు, వార్తాపత్రికలు, వార్తాసంస్థల టెలిప్రింటర్లకు వర్తించదు. ఈ మేరకు రాష్ట్ర ప్రభుత్వం ఒక నిర్ణయాన్ని చేసింది.

* ఆంధ్రప్రదేశ్ గిడ్డంగుల సంస్థ వాటా పెట్టుబడికై 3.35 లక్షల రూపాయల నివ్వడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది.

* వచ్చే రాష్ట్రశాసన సభ బడ్జెట్ సమావేశంలో కౌలుదారీ బిల్లును ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

* రాజమండ్రిలోని ఆంధ్ర పేపరు మిల్లును కొద్దిమంది ప్రైవేటు వ్యక్తులతో జాయింట్‌స్టాక్ కంపెనీగా పునర్నిర్మించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇందులో ప్రభుత్వానికి ఎక్కువ షేర్లు వుంటాయి.

* హైదరాబాద్ ఆల్విన్ మెటల్‌వర్క్స్‌లోని కొత్త షేర్లలో 48.5 శాతంపై పెట్టుబడి పెట్టడానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది. మొత్తం 86 లక్షల రూపాయల కొత్త పెట్టుబడి షేర్లలో 42 లక్షల రూపాయల ఖరీదుగల షేర్లను ప్రభుత్వం కొంటుంది.

* సకాలంలో జరిగే వ్యవసాయపు పనులకు ఆర్థికసహాయం చేయడానికి విజయవాడలోని ఆంధ్ర సహకార బ్యాంకు, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి 60 లక్షల రూపాయల ఋణాన్ని తెచ్చినందున ఆంధ్ర సహకార బ్యాంకుకు హామీగా వుండడానికి ప్రభుత్వం నిర్ణయించింది

* రాష్ట్రంలో ఏర్పట్ట విద్యుచ్ఛక్తి కొరతను కొంత తీర్చడానికై అమెరికా నుంచి రెండు ఆయిల్ ఫైర్ గ్యాస్ టర్బైన్‌లను దిగుమతి చేసుకోడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఒక్కొక్క టర్బైన్ శక్తి 11,000 కి. వా. టర్బైన్ ఖరీదు 45 లక్షల రూపాయిలవుతుంది. విద్యుచ్ఛక్తి వాడకం ఎక్కువైనపుడు ఈ టర్బైన్‌లు అందుకు సరిపోతాయి. ఈ టర్బైన్‌లను అరేబియా, కెనడా, స్విట్జర్లాండ్ దేశాలలోకూడా వాడుతున్నారు.

# పండిన బీళ్లు

శ్రీ మిక్కిలి సుందరరావు

( గత సంచిక తరువాయి )

## 2 వ రంగం

(ధర్మయ్య గృహం, పత్రిక చదువుకుంటూ వుంటాడు)

**గోపాలం:** నమస్కారమండి.

**ధర్మయ్య:** నమస్కారం బాబూ-రండి, కూర్చోండి.

**గోపాలం:** పల్లెలో విషయాలు యెలావున్నాయండి.

**ధర్మయ్య:** ఏముంది బాబూ-అందరం నోళ్లు తెరుచుకుని నంది కొండ వైపు చూస్తున్నాం. అది పూర్తి అయిననాడు మా బ్రతుకులు పచ్చబడతాయి.

**గోపాలం:** ప్రాజెక్టు త్వరగానే పూర్తి అవుతుంది. కాని అందువల్ల భూమిలేని పేదరైతులు యెలా బాగుపడతారు ?

**ధర్మయ్య:** కూలినాలి చేసుకుంటారు. అంతేకదా ?

**గోపాలం:** కూలినాలి చేసుకునే జీవితాలు ఒక స్థాయికి రావాలంటే యెంత కాలం పడుతుంది! అందుకే ప్రభుత్వం సహకార సేద్యాన్ని అమలుజరుపబోతుంది. మనం కూడా యీ ప్రాంతంలో సహకార సేద్యాన్ని ప్రారంభిద్దాం.

**ధర్మయ్య:** కాని అందుకు మనకు భూమి కావాలి కదా.

**గోపాలం:** ప్రభుత్వం క్రింద వున్న బీళ్లు కొన్ని వందల యెక రాలు మన ప్రాంతంలో వున్నాయి. వాటిని మనం తీసుకో వచ్చు-అంతే కాక తాము సాగు చెయ్యలేక మించి వున్న భూముల్ని షావుకార్ల దగ్గర నుండి, జమీందార్ల దగ్గర నుండి ప్రభుత్వం స్వాధీనం చేసుకోవలసిందిగా చూద్దాం-

**ధర్మయ్య:** అది సాధ్యమేనంటావా ?

**గోపాలం:** మానవులంతా ఒక త్రాటి మీద నిలడితే సాధ్యపడని పని అంటూ వుండదు. ముందు మనం. మన ప్రజల్లో ఐకమత్యాన్ని సాధించాలి. మనమంతా ఒక బలమైన సంఘంగా ఏర్పడాలి. అప్పుడు మనం సహకార సేద్యానికి సిద్ధంగా ఉన్నామని ప్రభుత్వానికి తెలియచెయ్యాలి. అప్పుడు మిగతా పని అంతా ప్రభుత్వమే చూసుకుంటుంది.

**ధర్మయ్య:** దానివల్ల పేద ప్రజలు బాగుపడతారా బాబూ.

**గోపాలం:** జర్మనీ. చైనా మొదలైన దేశాలు సహకార సేద్యాన్ని చేపట్టి యెంతో కాలమైంది. ఆ పథకాలు ఆ దేశాల్లో యెంతో విజయవంతమౌతున్నాయి.

**ధర్మయ్య:** ఇంతకూ వాటివల్ల మనకు జరిగే మేలు యేమిటి నాయనా

**గోపాలం:** ప్రతివ్యక్తికీ కూలి దొరుకుతుంది. సేద్యం వల్ల వచ్చిన ఆదాయం మీద అందరికీ హక్కు వుంటుంది. భూమ్మీద మాత్రం ప్రభుత్వానికే అధికారం వుంటుంది. అందువల్ల రేపటి జీవితాన్ని గురించి యివ్వాళ మనం ఆలోచించాల్సిన పనిలేదు.

**ధర్మయ్య:** నీవు చెప్పే విషయాలు యెంతో ఉత్సాహంగా ఉన్నాయి బాబూ-అటువంటి పరిస్థితుల్లో అంతా కష్టపడి పనిచేస్తారు సోమరిపోతులు దేశంలో ఉండడానికి ఆస్కారం వుండదు.

**గోపాలం:** అంతేకాదు. తరతరాలుగా వ్యర్థంగా ఉన్న భూములన్నీ కళకళలాడుతాయి. కలకాలం మనకు సహకరిస్తాయి.

**ధర్మయ్య:** నిజం బాబూ-అప్పుడు దేశంలో పనిలేదని విచారించే వాడుగాని తిండి లేదని బాధపడేవాడుగాని వుండడు.



ఆంధ్రప్రదేశ్ వర్తకుల మహాసభను ముఖ్యమంత్రి హైదరాబాదులో ఏప్రిల్ 20వ తేదీన ప్రారంభించారు.

సికిందరాబాద్ గాంధీ ఆస్పత్రిలో నూతనంగా నిర్మించిన శస్త్ర చికిత్సశాలకు ముఖ్యమంత్రి
మే 3వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు.



కర్నూలు జిల్లా బైర్లూటి చెంచుకాలనీ చెంచుల బాలలు 22-4-1962 తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి నమస్కారాలర్పిస్తున్న దృశ్యం.



అఖిలభారత వార్తా పత్రికా సంపాదకుల సభకుచెందిన స్థాయీ సంఘం మే, 1న నాగార్జున సాగర్ ప్రాజెక్టును సందర్శించింది.



ఒక పైలట్ శిక్షణ కోర్సును ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల మంత్రి హైదరాబాదు యూసఫ్‌గూడాలో ఏప్రిల్ 7వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.



లలితకళా ఎకాడెమీవారు హైదరాబాదు అజంతా మంటపంలో ఏర్పాటుచేసిన చిత్రకళా ప్రదర్శనను 1962 ఏప్రిల్ 20 వ తేదీన గుజరాత్ గవర్నరు నవాబ్ మెహిదీ నవాజ్ జంగ్ ప్రారంభోత్సవం చేశారు.



నూతన భారత ఉపరాష్ట్రపతి డాక్టర్ జకీర్ హుస్సేన్



ఉత్తమనటి:- నల్గొండలో ఏప్రిల్ 20, 21 తేదీలలో జరిగిన జిల్లా నాటక, పాటల పోటీలలో ఉత్తమ నటిగా ఎన్నికైన వెంకమ్మ.



కర్నూలు జిల్లా జుర్రేరు ప్రాజెక్టుపని త్వరితంగా సాగుతున్నది.

మహబూబ్ నగర్ జిల్లా నగరంలో భవనాలు కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ మీర్ అహమ్మద్ అలీఖాన్ 2-4-1962న మీటను నొక్కి విద్యుచ్ఛక్తికి ప్రారంభోత్సవం చేశారు.



మహబూబ్ నగర్ లో ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకుకు మే 4వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం
చేసినప్పుడు సభకు హాజరైన ప్రజాసందోహం



హైదరాబాదు కేన్సర్ ఆస్పత్రిలోని కోబాల్టు యూనిట్‌ను గుజరాత్ గవర్నర్
25-4.1981న ప్రారంభించారు.

గోపాలం: ప్రతివ్యక్తికీ ఉండటానికి యిల్లూ, తినడానికి కడుపు నిండా తిండీ, ఒంటినిండా బట్టా, వుండాలనే-ప్రభుత్వం యీ మార్గాన్ని అవలంబించబోతుంది.

ధర్మయ్య: కాని సహకార సేద్యానికి ఆమోదించి షావుకార్లు, తమ భూముల్ని ప్రభుత్వపరం చెయ్యాలి కదా-

గోపాలం: నిస్వార్థపరులైన వారు దేశ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని కొందరు తప్పక ముందుకు వస్తారు. మిగతా వారు క్రమేణా దారికి వస్తారు.

ధర్మయ్య: ఏ ఒడుదుడుకులూ లేకుండా అన్నీ సక్రమంగా జరిగితే బాగుంటుందనేదే నా కోర్కె (లోపలికి చూస్తూ) అమ్మా, రాధా–గోపాలం బాబు వచ్చారు.

గోపాలం: రాధ, బాగుందా అండి.

ధర్మయ్య: అదే బాగు నాయనా–పేదవాళ్ళం–అలా యెండుతూ వాడుతూ వున్నాం–కూర్చోండి బాబు – లోపలికి వెళ్లి వస్తాము.

రాధ: (ప్రవేశం, మల్లెపువ్వు వంటి యువతి కాఫీ తెచ్చి, సిగ్గుపడుతూ) తీసుకోండి.

గోపాలం: ఎవర్ని ?

రాధ: కాఫీని

గోపాలం: కాఫీని రోజూ తీసుకుంటూనే వున్నాగా

రాధ: అయితే యేం కావాలి?

గోపాలం: రాధా, ఈ గోపాలానికి ఓ రాధ కావాలి.

రాధ: ఈ రాధకు మాత్రం ఓ గోపాలం అక్కర్లేదు.

గోపాలం: అదేమిటి రాధా ?

రాధ: ఏం, లేదు. నేను దురదృష్టవంతురాల్ని– (విచారంగా) నన్ను క్షమించండి.

గోపాలం: ఏమిటి రాధా, ఏం జరిగింది ?

రాధ: అవన్నీ దయచేసి అడక్కండి. నా బ్రతుకు నన్ను బ్రతకనివ్వండి.

గోపాలం: రాధా, నాకు అన్నీ తెలుసు–మా నాన్నగారి ప్రవర్తన బట్టేనా, నీ విలా మాట్లాడుతుంది. ఆ విషయాలు దయచేసి నీవు పట్టించుకోవద్దు, అన్నీ చూడ్డానికి నేను వున్నాను.

రాధ: కాఫీ త్రాగండి.

గోపాలం: మీ నాన్నగారివి ఎంత కష్టాలు పెడుతున్నారో, మీ మీద యెన్ని నిందలు వేస్తున్నారో నాకు తెలుసు–కాని అన్నీ సర్దుకుంటాయి నిదానంగా.

రాధ: మీరు క్షేమంగా తిరిగొచ్చారు అదే చాలు.

గోపాలం: నీవు తియ్యగా మాట్లాడుతున్నావు, అదే పదివేలు

రాధ: కాఫీ మరచిపోయారు, ఆరిపోతుంది.

గోపాలం: నీ ముందు సమస్తం మరిచిపోతాను రాధా.

గోపాలం: (కాఫీ త్రాగుతూ) అబ్బ ! ఎంత మధురంగా వుంది ! కాఫీ ఎంత బాగా చేశావు రాధా.

రాధ: పోండి, వూరికే ఆటలు పట్టిస్తారు.

గోపాలం: సాయంకాలం మీటింగు వుంది. వస్తావు కదూ ?

రాధ: తప్పక వస్తాను, సరే గాని ఇలా రండి.

గోపాలం: ఏమిటి ? (లేచి ముందుకు పోతాడు)

రాధ: అలా చూడండి

గోపాలం: ఓహ్ ! చాలా మనోహరంగా వుంది. మీ యింటి దగ్గర నుండి నందికొండ డాము ఎంత అందంగా కనబడుతుంది? ఆ పొలాలు ఆ కట్టడాలు, బిల్లు, స్థంభాలు, శ్రామిక జీవులు–దృశ్యం చాలా బాగుంది రాధా.

రాధ: నందికొండ నాగార్జునసాగరం రావాలని యెన్నాళ్ళ నుండో మనం కన్న కలలు, అలా మూర్తీభవించి కళ్ళ ముందు నిలుస్తున్నాయి కదండి.

గోపాలం: (నవ్వుతూ) నీకు కవిత్వం కూడా వచ్చన్న మాట !

ధర్మయ్య: కవిత్వమా బాబు ! నిజంగా నందికొండను చూస్తుంటే గుండెలుప్పొంగుతున్నాయి బాబు ! గొంతెత్తి పాడాలని పిస్తుంది !

గోపాలం: నిజమేనండి–కలకాలంగా దేశంలో గజ్జెకట్టి నృత్యం చేస్తున్న కరవు రాక్షసి నేటితో పరాజయం పొందుతుంది.

ధర్మయ్య. బాబూ, మీటింగుకు టైమయ్యింది వెళ్దామా?
గోపాలం: పదండి.

(తెర పడుతుంది.)

3 వ రంగము

(ధర్మయ్య యిల్లు – తెరలేచే సరికి ధర్మయ్య తలకు

కట్లతో—మంచం మీద మూలుగుతూ వుంటాడు.)

రాధ: (పరిచర్యలు చేస్తూ) ఊరుకోండి నాన్నా—తగ్గిపోతుందిలే—జమీందారు యింత పని చేయిస్తాడని కలలోకూడా అనుకోలేదుగా మనం.

ధర్మయ్య: నాకేం బాధ లేదు తల్లి—నేను పోతే నీవు దిక్కూ మొక్కూ లేనిదానివై పోతావు.

రాధ: (దుఃఖంగా) నాన్నా!

గోపాలం: రాధా, ఏమిటిది? వూరుకో—అంతా మన మేలుకే జరిగింది—కాని ప్రజలంతా మనవైపే వున్నారు. మీటింగును గలభా చెయ్యాలని మా నాన్న యెంతో ప్రయత్నించారు. రౌడీల నుపయోగించి కూడా పరాజయం పొందారు—ప్రజలే వాళ్లకు బుద్ధి చెప్పారు—ఇక వాళ్లకు ఈ ప్రజాస్వామ్య దేశంలో స్థానం లేదని నేటితో ఋజువయ్యింది. మనవాళ్లు మొత్తం యెంత మంది దెబ్బలు తిన్నారు?

రాధ: నలుగురు.

గోపాలం: మీ నాన్నగారికి ఎలావుంది?

రాధ: ఫరవాలేదు.

గోపాలం: ఈ అభివృద్ధి నిరోధక శక్తులకు బుద్ధి చెప్పే రోజు వచ్చింది. ఇవ్వాళనుండి మా నాన్నగారితో తెగతెంపులు చేసుకున్నాను. ఇక మీ వద్దనే వుంటాను—

ధర్మయ్య: అదేమిటి బాబూ, మీ తండ్రిగారు యింకా మన మీద దౌర్జన్యానికి దిగుతారేమో!

గోపాలం: అవన్నీ లాభం లేదు. నా నిర్ణయాన్ని మాత్రం మార్చుకోదలుచుకోలేదు.

చుక్కయ్య: (ప్రవేశిస్తూ) బాబూ యిక్కడే వున్నారా? మీటింగులో భలే మాట్లాడారు బాబూ—జనం అంతా మీరు చెప్పినట్లే చేస్తామంటున్నారు.

గోపాలం: నువ్వు యిలా వచ్చేవేం చుక్కయ్యా.

చుక్కయ్య: ఉద్యోగం వదలివేశాను బాబూ—బాబుగారు మీటింగుకు వెళ్లానని పోట్లాడారు. ఉద్యోగం వెంటనే వదిలేశాను.

గోపాలం: అయితే యింకేం—నువ్వుకూడా యిక్కడే వుండు మన సమాజానికి తోడ్పడవచ్చు—

కోటిగాడు: (ప్రవేశం, తలకు కట్లు కట్టుకుని వుంటాడు. బట్టలన్నీ రక్తంతో తడిసి వుంటాయి) బాబూ—ధర్మయ్య బాబూ—నన్ను మన్నించండి—ధర్మమూర్తిని కానక కొట్టాను షావుకారు మాటలు విని—(ధర్మయ్య పాదాలు పటుకుని వాలిపోతాడు.)

ధర్మయ్య: లే కోటయ్యా, నీ తప్పేముంది? ఇతరుల మాటలు విని చెయ్యి చేసుకున్నావు, అంతేకదా!

కోటిగాడు: ప్రజలంతా నన్ను చంపాలని వస్తున్నారు. నన్ను కాపాడండి బాబూ—

ధర్మయ్య: నీకేం భయం లేదు. ఈ ధర్మయ్య వుండగా నిన్ను యెవ్వరూ కొట్టరు—భయపడకు—

గోపాలం: ఏం, కోటయ్యా. యివ్వటికైనా బుద్ధి వచ్చిందా?

కోటిగాడు: బుద్ధి గడ్డి తిని యిలా చేశాను. మన్నించండి బాబూ—నా పెళ్లాంకూడా నన్ను యింటికి రానివ్వడంలేదు.

గోపాలం: ఏం. ఫరవాలేదు.

పరంధామయ్య: (ప్రవేశం) ధర్మయ్యగారూ, ధర్మయ్యగారూ ఎలా వుంది మీకు—

గోపాలం: ఎలా వుంటే మీకెందుకు? ఎం ధర్మయ్యను చంపాలని వచ్చారా? ముందు నన్ను చంపి తరువాత ధర్మయ్యను చంపండి.

(గోపాలం తండ్రికి ఎదురుగా నిలబడుతాడు.)

పరంధామయ్య: లేదు బాబూ—నీవు ఒక్కగా నొక్క కొడుకువి. నీవు ప్రజలకు మేలు చేస్తానంటున్నావు—నిన్ను ఎందుకు అడ్డగించాలి. మన ఆస్తి అంతా మీ సమాజానికి రాసిస్తాను—మీరంతా కలిసి కట్టుగా పని చెయ్యండి—నేను మారిపోయాను—ఇవ్వాళ జరిగిన ఘోరమైన రక్తపాతంతో నాకు జ్ఞానోదయ మయ్యింది. గాంధీగారి అడుగు జాడల్లో నడుద్దాం—మానవులంతా ఒక్కటే—కుల మత భేదాలు విడనాడి అందరం కలిసి అభివృద్ధి సాధిద్దాం.

గోపాలం: నాన్నా!

పరంధామయ్య: ఔను_బాబూ__నీ యిష్టం__నీవంటే ప్రజలంతా యిష్టపడుతున్నారు. నీవే మమ్మల్ని నడిపించు.

కోటిగాడు: బాబుగారు మారిపోయారు.

చుక్కయ్య: దండాలు బాబు_చాలా సంతోషం.

పరంధామయ్య: ఔనయ్యా_మనమంతా మానవులం_మనది భారత దేశం_మనదేశ అభివృద్ధికి మనం పాటుపడిన నాడే మనం భారతీయుల మనిపించుకుంటాం_రాధా_రామ్మా_ధర్మయ్యగారూ_రాధ నాకోడలు_మీరు నా ప్రార్థన అంగీకరించాలి_ బాబూ గోపాలం_రాధ చాలా మంచిదిరా_నీకు తగిన భార్య అవుతుంది.

గోపాలం: నాన్నా_నేటితో మన కష్టాలు తొలిగాయి_అవిగో_తూర్పుదిక్కున వెలుగురేఖలు మనకు శుభం పలుకుతున్నాయి_పదండి_ అడవుల్ని_బీళ్ళను నరికిపారేద్దాం _ నందికొండ ప్రాజెక్టు అదిగో వస్తుంది. ఈ భూమి అంతా సస్యశ్యామలమై బంగారు పంటలు పండుతుంది_ అందరం కలిసి కష్టపడి పనిచేద్దాం పదండి.

కోటిగాడు: గోపాలం బాబుకూ

అందరూ: జై

కోటిగాడు: సహకార సేద్యానికి

అందరూ: జై

కోటిగాడు: భారతదేశం వర్ధిల్లాలి

అందరూ: వర్ధిల్లాలి

కోటిగాడు: ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి

అందరూ: వర్ధిల్లాలి

(తెర)

## ఇద్దరూ ఆంధ్రమాత పుత్రులే....

"నూతన రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలోనే జన్మించారు. ఇది ఆంధ్ర ప్రజల కెంతో గర్వకారణం. అంతేకాదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆరుగురు గవర్నర్లను దేశానికి ప్రసాదించింది. నూతన ఉప రాష్ట్రపతి డాక్టర్ జకీర్ హుస్సేన్ హైదరాబాద్‌లోనే జన్మించినట్లు సామాన్యంగా ఎవరికీ తెలియదు. ఇంతకుముందు లోకసభస్పీకరు, రాజ్యసభాధ్యక్షులుకూడా ఆంధ్రకు చెందిన వారే; శ్రీ అనంతశయనం అయ్యంగారు బీహార్ గవర్నర్‌గా నియమింపబడడంతో ఆంధ్రుల కీర్తి కిరీటంలో మరొక పింఛం అమరింది"

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (18_5_62)

# ????? ప్రశ్నలు - సమాధానాలు !!!!!

శ్రీ సత్యనారాయణ, కరన్‌కోట:

ప్రశ్న: హైదరాబాదుజిల్లా తాండూరులో సిమెంటుఫ్యాక్టరీ రిజిస్టరై రమారమి రెండు సంవత్సరాలైనది, కొంత వాటా మూలధనం కూడ సేకరించబడినదట, పని యెప్పుడు ప్రారంభం కాగలదు?

జవాబు: సహకారశాఖ తాండూరు సిమెంటు ఫ్యాక్టరీని రిజిస్టరు చేసినప్పటికి, దానికి, కేంద్రప్రభుత్వం, పరిశ్రమల (అభివృద్ధి నియమ నిబంధనలు) చట్టంక్రింద లైసెన్సు యివ్వలేదు. వాటా మూలధనంకూడా కావలసిన మేరకు సేకరించబడలేదు.

ప్రశ్న: 1961_62 లో హైదరాబాదు జిల్లా తాండూరు తాలూకాలో ఎన్ని గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినది?

జవాబు: ఈ ఆర్థిక సంవత్సరంలో యింత వరకూ ఆ తాలూకాలో యే గ్రామానికీ విద్యుచ్ఛక్తి సరఫరా చేయడంలేదు.

శ్రీ నల్లా దత్తాత్రేయులు, రాజోలు, తూర్పుగోదావరి జిల్లా.

ప్రశ్న: తూర్పు గోదావరిజిల్లా తాటిపాక గ్రామంలో గంధకం గనులు కనుగొనబడిన మాట వాస్తవమా?

జవాబు; అటువంటిదేమీలేదు.

శ్రీ డి. వెంకట్రామయ్య, వుప్పలూరు, కావలి తాలూకా

ప్రశ్న: నెల్లూరు జిల్లా కావలి తాలూకా చినక్రాక నాన్ బ్లాక్ ప్రాంతం బ్లాకుగా యెప్పుడు మార్చబడుతుంది.

జవాబు: చినక్రాక బ్లాకు యిప్పటికే ప్రథమ దశ బ్లాకుగా వున్నది. కొన్ని న్యాయసంబంధమైన చిక్కుల మూలంగా, 2_10_61 న యీ బ్లాకుకు పంచాయితీ సమితిని యేర్పరచడం కుదరలేదు.

శ్రీ వి. వెంకటనర్సయ్య, బలరావ్‌పేట, లక్ష్మిపురం, మంచిర్యాల

ప్రశ్న: 500 జనాభాగల గ్రామానికి ప్రత్యేక పంచాయతీ యేర్పాటు చేయవచ్చునని తెలిసినది. ఇందులో పిల్లలుకూడా చేరివున్నారా లేక అది వయోజనులకే వర్తిస్తుందో దయయుంచి స్పష్టపరుస్తారా?

జవాబు: ప్రత్యేక పంచాయతీల నిర్మాణానికి కనీస జనాభాను నిర్దేశించే 1956 హైదరాబాదు గ్రామ పంచాయితీ చట్టం 3 వ సెక్షన్‌లో యిందుకు సంబంధించిన భాగం దిగువ యివ్వబడి

నది; గత అధికార జనాభా లెక్కల ప్రకారం 1,000 కి తక్కువ కాకుండా, 5,000 లకు మించకుండా జనాభాగల యే రేవిన్యూ గ్రామమైనా, ప్రభుత్వం యీ చట్టం ప్రయోజనాలకై జిల్లా బోర్డుతో సంప్రదించి, అఫీషియల్ గెజిట్‌లో ప్రకటిత మైన ప్రకటనలో నిర్దేశించబడిన విధంగా, ఒక గ్రామంగా ప్రకటించవచ్చు.

శ్రీ ఎ. లక్ష్మీనరసింహం, ఏడుబాడు, గుంటూరుజిల్లా.

ప్రశ్న: కోళ్ల పెంపకం కేంద్రం స్థాపనకు ప్రభుత్వమేమైనా సహాయం చేస్తుందా? షరతులు మున్నగువాటి వివరాలను దయతో తెలుపండి.

జవాబు: ప్రతి జిల్లాలోను పెక్కురు రైతులు కోళ్ల పెంపకాన్ని ముఖ్య లేక ఉపవృత్తిగా సాగిస్తారు. వీరిలో అనుభవం, యెక్కువ ఆసక్తి కలవారు కొందరిని-జిల్లా పరిషత్తులేక పంచాయితీ ద్వారా యెన్నికచేసి పశుపోషణశాఖచే తృతీయ ప్రణాళికా పథకాలక్రింద రూ. 100 వరకు సహాయంచేయబడు తుంది. అపైన, నిర్ణీత గ్రామాలలో స్థానిక జాతుల స్థానంలో విదేశ రకాలు ప్రవేశపెట్టబడతాయి. ప్రభుత్వశాఖ సహాయానికై జిల్లా వెటరినరీ ఆఫీసరు పేర వ్రాయవచ్చు. సహాయాన్ని పొందేవారు ఒప్పందం బాండుపై సంతకం చేయాలి.

ఇదికాక, బ్లాకునిధులతో, బ్లాకు క్రిందగల ప్రతి రెండు గ్రామస్థాయి కృషి కేంద్రాలకు ఒక కోళ్ల పెంపకం కేంద్రం ప్రారంభింపబడుతున్నది. ఈ విషయంలో వివరాలను పంచాయతీ కార్యాలయంలో తెలుసుకోవచ్చు.

శ్రీ రావి చంద్రశేఖర్‌రావు, రాయదుర్గం.

ప్రశ్న: కరువు భత్యాన్ని జీతంతోకలిపే వుత్తరువు ఆంధ్రలో మార్కెటు కమిటీ సిబ్బందికి వర్తింప చేయబడలేదు. ప్రస్తుతం యిది యేదశలో వున్నదో దయయుంచి చెప్పగలరా?

జవాబు: ఈ విషయంలో ఆంధ్రప్రాంతంలో గల మార్కెటు కమిటీలన్నిటినుంచి ప్రతిపాదనలు కోరబడినవి. అన్ని వివేది కలు చేరిన పిమ్మట ప్రతిపాదనలు ప్రభుత్వ మంజూరికై పంపబడగలవు.



పండు దిని టెంక బార్వేయు పగిది యొకటి
టెంకనుం దిని జీవించు పంక మొకటి,
జీవ మాధారమై మను జీవి యిట్లు,
తగిలి తనుదానె దినుచున్న దౌర సృష్టి!

"మధుగీత"

# విద్యుచ్ఛక్తి సరఫరా

1962 మార్చి నెలలో అనంతపురం ఆపరేషన్ సర్కిల్‌లో దిగువ 108 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది:

| గ్రామం, శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| **కర్నూలు జిల్లా** | |
| గుల్యం | ఆలూరు |
| మండ్లెం | నందికొట్కూరు |
| వేములకోట | మార్కాపురం |
| చింతకుంట | .. |
| కంచియపల్లి | గిద్దలూరు |
| పెద్దకండ్ల | ఆళ్లగడ్డ |
| నాగిరెడ్డిపల్లి | .. |
| జలదుర్గం | ధోన్ |
| **అనంతపురం జిల్లా** | |
| చిల్లకొండయపల్లి | ధర్మవరం |
| రాళ్లహల్లి | మడకశిర |
| పాలసముద్రం | హిందూపురం |
| పేటకుంట | పెనుకొండ |
| లోచెర్లు | .. |
| గోరంట్ల | హిందూపురం |
| దుగ్గమర్రి | అనంతపురం |
| శ్రీకాలుం | హిందూపురం |
| నరసింహరాయనకుప్పం | మడకశిర |
| చల్లపల్లి | పెనుకొండ |
| మగేచెర్వు | .. |
| బీరేపల్లి | హిందూపురం |
| ఆత్మకూరు | ధర్మవరం |
| పద్మాలియాలేరు | అనంతపురం |
| నరసాపురం | హిందూపురం |
| పైదేటి | .. |
| నల్లచెరువు | కదిరి |
| జగంపేట | .. |
| మోతుకపల్లి | .. |
| చీపులేటి | మడకశిర |
| రంగన్నగారిపల్లి | మదిరి |
| శంకరగల్లి | మడకశిర |
| కొండాపురం | పెనుకొండ |
| బండ్లపల్లి | .. |
| నాగలూరు | .. |
| పాల్తూరు | ఉరవకొండ |
| అందబండ | .. |
| చిక్కలగ్రికి | .. |
| మొగిడి | రాయదుర్గం |
| అమిద్యాల | ఉరవకొండ |
| రాకట్ల | రాయదుర్గం |
| చిన్నకౌకుంట్ల | .. |
| పెద్దకౌకుంట్ల | .. |
| రామాపురం | .. |
| దడితోట | తాడిపత్రి |
| నర్గాల | అనంతపురం |
| కరుత్తంపల్లి | .. |
| లోలూరు | .. |
| రఘునాధపురం | |
| **కడపజిల్లా** | |
| అమ్మలాపురం | ప్రొద్దుటూరు |
| చిన్నగురువల్లూరు | .. |
| పెద్దచాగల్లు | కమలాపురం |
| కొత్త అగ్రహారం | రాజంపేట |
| బొమ్మవరం | .. |
| కందులవారిపల్లి | .. |
| బనవపల్లి | .. |
| జెట్టిరాజపల్లి | .. |
| మల్లంపల్లి | .. |
| కాక్సా సముద్ర అగ్రహారం | .. |
| చిత్వాల్ | .. |
| అలివేలుమంగాపురం | .. |
| గౌరిగానూలు | జమ్మలమడుగు |
| దేవగుడి | .. |
| అన్నవరం | ప్రొద్దుటూరు |
| సకుదలూరు (చంద్లూరు) | .. |
| పెద్దపుట్ట | కడప |
| దుగ్గయ్యపల్లి | |

| గ్రామం శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| కొక్కరాయపల్ల | .. |
| దర్జేపల్లి | సిద్ధావటం |
| గొల్లపల్లి | .. |
| భద్రపేట | .. |

## చిత్తూరు జిల్లా

| | |
|---|---|
| ఆకమంబట్టు | చిత్తూరు |
| రంగాపురం | .. |
| కృష్ణాపురం | .. |
| సామంతం | .. |
| అమ్మేపల్లి | .. |
| మర్రిపాడు | వాయల్పాడు |
| ఘట్టు | మదనపల్లి |
| కొరివివారి పాలెం | .. |
| కొంగళ్లపల్లి | .. |
| నల్లప్పరెడ్డిగారిపల్లి | .. |
| రెడ్డివారిపల్లి | .. |
| రాయవారిపల్లి | చంద్రగిరి |
| తరికొండవారిపల్లి | .. |
| కమ్మంపల్లి | .. |
| వెంకమద్దివారిపల్ల | .. |
| నవతాపల్లి | .. |
| ఎగువచౌడేపల్లి | పుంతనూరు |
| సూసుపల్లి | వాయల్పాడు |
| నక్కలవారిపల్లి | .. |
| చింతలవారిపల్లి | .. |
| కొత్తపల్లి | .. |
| ఓబన్నపల్లి | చిత్తూరు |
| వజ్జరెడ్డిపల్లి | .. |
| పహాపేట | పలమనేరు |
| అబకలదొడ్డి | .. |
| దమకంపల్లి | .. |
| బొమ్మనపల్లి | .. |
| పాలసముద్రం | చిత్తూరు |
| దీనబంధుపురం | .. |
| రాజుపాలయం | .. |

| గ్రామం శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| రాళ్లబుడుగూరు | పలమనేరు |
| తిమ్మనబక్కం | సత్యవేడు |
| ఉరూరు | .. |
| కైలాసపురం | పుత్తూరు |
| రాజులకండ్రిగ | .. |
| రామసముద్రం | .. |
| ఆగరాం | .. |
| నంబకం | .. |
| కాశికాపురం | .. |

1961 డిసెంబరు నుంచి 1962 మార్చి వరకు విజయవాడ ఆపరేషన్ సర్కిల్‌లో దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది.

## పశ్చిమ గోదావరి జిల్లా

| గ్రామం శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| పెదకడియం, కొప్పాక శివారు రామచంద్రపురం, | ఏలూరు |
| బాపిరాజుగూడెం శివారు | కొవ్వూరు |
| వెల్లచింతల గూడెం | .. |
| తాడిపూడి | పోలవరం |
| రామన్నగూడెం, పెదతాడిపల్లి శివారు | తాడేపల్లిగూడెం |
| గోపాలపురం | ఏలూరు |
| గూటాల | పోలవరం |
| పాతపాటిసెమ్మ | .. |
| పాతిసీమ | .. |
| చింతలకోటిగరువు రాయకుదురు శివారు. | భీమవరం |
| అమ్మపాలెం. కొప్పాకశివారు | ఏలూరు |
| గొల్లవానితిప్ప | .. |
| నాగులపల్లి | .. |
| అజ్జావానిగూడెం, భీమడోలుశివారు | .. |
| లక్ష్మీపురం, పేదవేగిశివారు | .. |
| హీవలిపురం | తణుకు |
| నరిపాలెం | నరసాపురం |
| గునమర్రు | .. |

| గ్రామం శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| సత్యవోలు | ఏలూరు |
| కొత్తపాలెం, మొగల్తుర్రుశివారు | నరసాపురం |
| కాళ్ల | భీమవరం |
| నూసలి | .. |
| కొలనపల్లి | .. |
| కొప్పవరం | కొవ్వూరు |
| కాలరాయగూడెం | చింతలపూడి |
| శింగగూడెం | .. |
| లింగగూడెం, శింగగూడెంశివారు | చింతలపూడి |
| పూలపల్లి | నర్సాపురం |
| వడిపూడి | .. |
| **కృష్ణా** | |
| భూషనగల్లు | గుడివాడ |
| పెండ్యాల | నందిగామ |
| కూచికాయలపూడి | గుడివాడ |
| పోచంపల్లి | నందిగామ |
| శనగపాడు | .. |
| గొట్టుముక్కల | విజయవాడ |
| జుజ్జూరు | నందిగామ |
| నరసింహారావుపాలెం | .. |
| అగ్గిపర్రు | గన్నవరం |
| మామిళ్లపల్లి | .. |
| పద్మతలంకపల్లి | .. |
| పెనుమత్స | .. |
| శ్రీరంగపురం | .. |
| గిరివాడ | .. |
| పోలవరం | మచిలీపట్నం |
| మల్లవోలు | .. |
| ఐదుగుళ్లపల్లి | .. |
| విడుమోలు | .. |
| కొలిమెర్ల | గుడివాడ |
| నిమ్మలూరు | .. |
| ఏలకొర్రు | .. |
| గుడిపాడు | నూజివీడు |
| చెక్కలపల్లి | .. |

| గ్రామం శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| **గుంటూరు** | |
| కుంకలమర్రు | బాపట్ల |
| కంతేరు | గుంటూరు |
| కొప్పురావూరు | .. |
| మైదవోలు | నరసరావుపేట |
| పెదమద్దూరు | గుంటూరు |
| గురవారెడ్డిపాలెం | ఒంగోలు |
| మారెలగుంటూరుపాలెం | .. |
| నరసయపాలెం | .. |
| రుద్రవరం | .. |
| నేలటూరు | ఒంగోలు |
| గిలకలవారిపాలెం | రేపల్లె |
| వెలమవారిపాలెం | .. |
| వెనిగెళ్లవారి పాలెం | .. |
| మైనేనివారి పాలెం | .. |
| ఆలూరు | ఒంగోలు |
| కొత్తపట్నం | .. |
| ఐతముక్కల | .. |
| మదనూరు | .. |
| బొద్దపాడు | తెనాలి |
| ప్యాపర్రు | .. |
| వెంజెండ్ల | గుంటూరు |
| సుద్దపల్లి | .. |
| ఇంటూరు | తెనాలి |
| నిజాంపట్నం | రేపల్లె |
| కారంపూడి | పల్నాడు |
| నగిరికల్లు | .. |
| ముత్తూరు | గుంటూరు |
| దొడ్డవరం | ఒంగోలు |
| తెల్లపాడు | .. |
| సంద్రపాడు | .. |
| ముప్పాళ | సత్తెనపల్లి |
| చాగంటివారిపాలెం | .. |
| అప్పికట్ల | బాపట్ల |
| పూండ్ల | .. |

| గ్రామం, శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| కరునూరువారిపాలెం | బాపట్ల |
| అమీనాబాదు | సత్తెనపల్లి |
| వేములవారి పాడు | |

## నెల్లూరు

| గ్రామం, శివారు లేక పట్టణం పేరు | తాలూకా |
|---|---|
| సోమరాజుపల్లి | కందుకూరు |
| అమ్మారెడ్డిపాలెం | కోవూరు |
| జలదంకి | కావలి |
| మింగల్లు | కోవూరు |
| బుడంగుంట | కావలి |
| అగ్రహారం, కావలిశివారు | ,, |
| అంబాపురం | నెల్లూరు |
| మాచెర్లవారిపాలెం, తోటపల్లిశివారు | ,, |
| తోటపల్లి | ,, |
| వల్లూరు | నెల్లూరు |
| తాళ్ళపూడి | ,, |
| వరిగొండ | ,, |
| పిడతపోలూరు | ,, |
| మొదిగోడు | రాపూరు |
| దక్షిణ ఆములూరు | నెల్లూరు |
| చింతతోపు | ,, |
| ముంగలదోడూరు | ,, |
| తిమ్మనాయుడుపాలెం | గూడూరు |
| బేరిపేట | ,, |
| లక్ష్మీ అనంత సాగరం | సూళ్లూరుపేట |
| ఇసకపాలెం | కోవూరు |
| పల్లమూరు, ఇసకపాలెం శివారు | ,, |
| కొత్తగుడిపాలెం | ,, |
| చెన్నవరప్పాడు | నెల్లూరు |
| సోమరాజుపల్లి | ,, |
| అన్నమేడు | సూళ్లూరుపేట |
| పాటిమట్ట | ,, |
| ఏకసిరి | ,, |
| గుమ్మపాటిపాలెం | ,, |
| కూచినడపాలెం | ,, |
| గునపాడు | ,, |
| ఏనుగుంటపాలెం | ,, |
| వుచ్చులవారిపాలెం | ,, |
| బిరదవాడ | ,, |
| రాచపాలెం | ,, |
| అక్కరపాక | ,, |
| పోలిరెడ్డిపాలెం | ,, |
| ఓడూరు | గూడూరు |
| పెదపరియ | ,, |
| పున్నేపరిపాలెం | ,, |
| ఏగువరచపాలెం | ,, |
| ఓజిలి | ,, |
| పర్లపల్లి | కోవూరు |
| మంగనూరు | కావలి |
| కుమ్మరకొండూరు | ,, |
| మహాదేవపురం | కందుకూరు |
| చిన్న కనుమళ్ల | కందుకూరు |
| చాలగళ్ల | రాపూరు |
| జువ్వపాలెం | సూళ్లూరుపేట |

1962 మార్చిలో తెలంగాణా ప్రాంతంలో దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినది.

| గ్రామం | తాలూకా | జిల్లా |
|---|---|---|
| చిటకోడూరు | జనగాం | వరంగల్లు |
| దేవన్నపేట | వరంగల్లు | ,, |
| ఎంకిపల్లి | హైదరాబాదు పశ్చిమం | హైదరాబాదు |
| ఘులకీపురం | చేవెళ్ల | ,, |
| పీసుపల్లి, చిగురుమామిడిశివారు | కరీంనగరం | కరీంనగరం |
| చిగురుమామిడి | ,, | ,, |
| మల్లాపురం | ,, | ,, |
| కల్లూరు | సంగారెడ్డి | మెదక్ |
| మరిపెడ | మహబూబాబాదు | వరంగల్లు |
| అబ్బయిపాలెం | ,, | ,, |
| చిన్నధర్మారం | ,, | ,, |
| ఉప్పరీమెలియల | కరీంనగరం | కరీంనగరం |
| కుర్కియల్ | ,, | ,, |
| మొగ్గిపాలం | ,, | ,, |
| నారాయణపురం | మహబూబాబాదు | వరంగల్లు |
| మొగిలిచెర్ల | ,, | ,, |
| రాజోలు | ,, | ,, |
| గుండ్రాతిమడుగు | ,, | ,, |
| మత్వేలగూడ | తూర్పు హైదరాబాదు | హైదరాబాదు |
| ప్రతాపసింగరం | ,, | ,, |
| కొర్రమల్ | ,, | ,, |
| తేమగూడ | ,, | ,, |



# తుంగభద్ర!

శ్రీ టి.బి.యం. అయ్యవారు

జయ! స్వర్వాంధ్రధరారమా కుచతటీ
        చారూల్లలన్మౌక్తికో
చ్చయసంక్లప్త విలంబిహారదల ఘు
        స్వచ్ఛాంబువేణీ! హిమా
త్యయవేళామద కోకిలాకలకుహూ
        తంద్రస్వనత్ భంగ సం
చయనిస్వాన పరంపరా ముఖరితా
        శా! తుంగభద్రానదీ!

అనిలముహుర్విలోలభ వ
        దాయత తుంగతరంగమాలికా
క్వణము-లహాంపతిశ్రవణ
        పంచశరాంచిత చాపవల్లరీ
స్వనములు-కృష్ణరాయనృప
        శాశ్వత కీర్తి వధూపదాంగదో
ల్బణరవముల్-విలాసమధు
        రమ్ములు మాకు ప్రసన్నమయ్యెడున్.

జల్లులాడినవి-యీ సరిదంబుకల్లోల
        పాళి-రాయలవారి భద్రగజము
లీవారిఁగడిగినా రీర్ష్యావశ పరాస్ర
        ధారార్ద్రిముల-తెల్గువీరులసుల
నీనదీతటధాత్రి నెనసితజ్జాత్యశ్వ
        ఖురఘట్టిత పరాగ కోటిలేచె
నీ మహాంభోవేణి సామీప్యముననే-వ్యా
        యామజశ్రాంతి మల్లాళితొరగె
    అంచునీపూత సైకత ప్రాంతములను
    వెదకికొందుము-మాపురా విభవమణుల
    అడరెడి కదుష్ణ నిశ్వసితానిలముల
    నాగికొంచును నశ్రురుద్ధాక్షులమయి

తొలి జన్మమ్ముల నీ పవిత్రలహరీ
        స్తోమంబులో-జగ్గుని
గ్గులతోనే తెలిముత్తియంపు సొగసుం
        గ్రొందళ్కునై-లేఁతయెం
డల సింగారమునన్-మహేంద్రధనురు
        ద్యద్దీప్తిమైమంటినో-
కలతంజెందు మనస్సదెంతయు-నలం
        ఘ్యమ్ముల్ పురావాసనల్.



## సంగ్రహ ప్రకటనలు

### ఉపాధ్యాయుల నియోజకవర్గాలు

ఎయిడెడ్ పాఠశాలలు, కళాశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులు, ఉపాధ్యాయుల నియోజకవర్గాల నుంచి శాసనమండలి యెన్నికకు పోటీ చేయటానికి గల అర్హత విషయంలో దిగువ వివరణ యివ్వబడుతున్నది.

ఎయిడెడ్ పాఠశాలలు, కళాశాలల్లో పని చేసే ఉపాధ్యాయులు అవసరమైన సర్వీసు వున్న పక్షంలో, సర్వీసులో వుంటుండగా, లెజిస్లేటివ్ సంస్థల యెన్నికలకు నిలబడుటకు యెన్నికల న్యాయసూత్రం క్రింద అనర్హులు కారు. క్రమశిక్షణ 3 నిబంధనావళి క్రింద విధింప బడిన నియమాలు కూడ 1958 లో తొలగించ బడినవి. అయితే, నిర్వహణాధికారులు, అట్టి వ్యక్తి ఉపాధ్యాయుడుగా తన ధర్మాన్ని నెర వేర్చజాలడని భావించిన పక్షంలో, అతనికి కౌన్సిలు సభ్యత్వం వున్నంత కాలము లేక నిర్దిష్టమైన అంతకంటే తక్కువ కాలము సెలవు తీసుకొనమని అతనిని ఒత్తిడి చేయ వచ్చు.

### వక్ఫ్స్ కమిషనర్ విధులు

అక్రమ ఆక్రమణలను తొలగించి, యేదో ఒక విధంగా అన్యాక్రాంతం చేయబడిన ఆస్తిని తిరిగి తెచ్చుటకు వక్ఫ్స్ కమిషనరు వుత్తర్వు చేయగలరనే అభిప్రాయం ప్రజలలో ఉన్నట్లు కనబడుతుంది. వక్ఫ్స్ ఆస్తిని పరిశీలించి ప్రభుత్వానికి నివేదికను సమర్పించటం వరకే ఆయన కర్తవ్యం. అన్యాక్రాంతంలో వున్న ఆస్తుల విషయాన్ని కూడా ఆయన సర్వే చేస్తారనడంలో సందేహం లేదు.

వక్ఫ్ ఆస్తిని అమ్మటకు లేక మరేరకమైన ఆస్తిగానైనా మార్చుటకు లేక యెవరైనా కొనుటకు వీలులేనందున, అన్యాక్రాంతపు ఆటంకాలకు, అనధికారమైన ఆక్రమణలకు దారితీసే పరిస్థితులను పరిశీలించుటకు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ క్రింద వక్ఫ్స్ కమిషనర్కు అధికారం వున్నది. అయితే, యీ అధికారంలో, వెళ్లగొట్టుట మున్నగు వాటికి స్థానం లేదు.

### అనావృష్టి రక్షణ చర్యలు

విశాఖపట్నం జిల్లాలో అనావృష్టి వల్ల దెబ్బతిన్న 470 గ్రామాలకు 1371 వ ఫసలీకి దిగువ పద్ధతిలో మాగాణి పన్ను, నీటి తీరువలలో దిగువ రెమిషన్ యివ్వ బడినది.

1. పంట పరిమాణం నాలుగు అణాలు అంతకంటే తక్కువ వుంటే పూర్తి రెమిషను.

2. పంట పరిమాణం నాలుగు అణాలు దాటి ఆరు అణాలు లేక అంతకంటే తక్కువ వున్న పక్షంలో సగం రెమిషన్.

ఇప్పుడు 1371 వ ఫసలీకి మాగాణి పన్ను లేక నీటి తీరువ రెమిషన్ యివ్వబడిన భూముల విషయంలోనే భూమిశిస్తు బకాయిలు అప్పు బకాయిల వసూలును 1962 నవంబరు ఆఖరు వరకు వాయిదా వెయ్యాలని కూడ ప్రభుత్వం ఆదేశించినది.

### ప్రాజెక్టుల శాఖ

పబ్లిక్ వర్క్స్ (నాగార్జునసాగర్) శాఖ తగినంత యెక్కువ కాలం కొనసాగే అవకాశం వున్నందువల్ల, యితర ప్రాజెక్టుల అనగా శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టుల పని కూడ దానికికలిపినందున ఆ శాఖను 1-8-59 నుంచి సెక్రటేరియట్ శాశ్వత శాఖగా మార్చాలని ప్రభుత్వం ఆదేశించినది. దానిపేరు "ప్రాజెక్టుల శాఖ" గా మారవలసి వున్నది.

### చిన్ననీటి పారుదల సిబ్బంది

ఇప్పుడు పంచాయతీసమితులు, జిల్లా పరిషత్తుల క్రింద పనిచేసే చిన్ననీటి పారుదలకు సంబంధించిన సిబ్బందినంతను జిల్లా స్థాయిలో జిల్లాపరిషత్తు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు యొక్క, రాష్ట్ర స్థాయిలో స్థానిక పరిపాలన చీఫ్ ఇంజనీరు యొక్క పరిపాలనా సాంకేతిక అజమాయిషీ క్రింద వుంచవలెనని ప్రభుత్వం ఆదేశించినది.

## పాత అణా-నాణెములు

రాగి–నికెల్ (తెల్లటి) అణా నాణెములు కొన్ని ప్రాంతాలలో ముఖ్యంగా విశాఖపట్నంలో స్వేచ్ఛగా అంగీకరించ బడటం లేదన్న విషయం ప్రభుత్వ దృష్టికి కొనిరాబడింది. ఈ పాత అణా నాణెములు చెల్లవని ప్రకటించబడే వరకు మామూలుగా చెల్లుతవని ప్రజల సౌకర్యార్థం వివరింపబడుతున్నది. ఈ నాణెములను మార్చుకొనుటలో యిబ్బందికి గురిఅయే వారు వాటిని సమీపంలో గల ట్రెజరీ, ఇండియా స్టేట్ బ్యాంకు శాఖ లేక ప్రభుత్వ వ్యాపారం జరిపే దాని ఉపశాఖలో మార్చుకొన వచ్చును.

## జాతీయ పొదుపు సలహా సంఘం

జాతీయ పొదుపు రాష్ట్ర సలహా సంఘంలో దేవధర్మా దాయాలు, జాతీయ పొదుపు మంత్రికి స్థాన మివ్వాలని ప్రభుత్వం నిర్ణయించినది. పంచాయతీ రాజ్ కమిషనరు శ్రీ కె. ఎన్. అనంతరామన్, ఐ. సి. ఎస్. కూడ ఈ సంఘ సభ్యులుగా నియమింపబడ్డారు.

## హోటళ్లు మూసివేసే కాలం

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలోగల హోటళ్లు, ఆహార శాలలు, రెస్టారెంటులలో యేటక్కైనా యేరోజునైనా ఈ ప్రకటన ఆంధ్ర ప్రదేశ్ గెజిట్‌లో ప్రకటింపబడిన తేదీనుంచి ఉదయం 5 గంటలకి ముందు తెరువబడకూడదని, రాత్రి 1-30 గంటలుదాటి తెరచియుంచకూడదని 1951 ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతపు) షాపులు, యెస్టాబ్లిష్‌మెంట్ల చట్టం క్రింద ప్రభుత్వం ఆదేశించినది.

## కారియర్ల న్యాయసూత్రం పునర్విమర్శ

కేంద్ర ప్రభుత్వ న్యాయ మంత్రిత్వశాఖ యొక్క లా కమిషన్ కారియర్ల న్యాయసూత్ర పునర్విమర్శ పరిశీలనను, యీ విషయంలో సవరణలు మున్నగు వాటిని సూచించే కార్యక్రమాన్ని చేపట్టినది. ఈ సందర్భంలో, యీ విషయంలో ఆసక్తిక లచే వ్యక్తులు, సంస్థలఅభిప్రాయాలను యీ కమిషన్ సంతోషంతో స్వీకరిస్తుంది. వాటిని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శికి 1962 జూలై దాటకుండా పంపవలసి వుంటుంది

## షాపుల చట్టం క్రింద మినహాయింపు

ఆంధ్ర ప్రాంతంలోని అమ్మకం పన్ను ప్రాక్టీషనర్ల కార్యాలయాలు, 1947 ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) షాపులు, ఎస్టాబ్లిష్‌మెంట్ల చట్టం నిబంధనలన్నిటినుండి మినహాయించబడినవి. అలాగే, తెలంగాణా ప్రాంతంలోని అమ్మకం పన్ను ప్రాక్టీషనర్లు రాబడి పన్ను ప్రాక్టీషనర్ల కార్యాలయాలు 1951 ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) షాపులు, యెస్టాబ్లిష్‌మెంట్ల చట్టం నిబంధనలన్నిటినుంచి మినహాయింపబడినవి.

## ఆంధ్ర ప్రదేశ్ స్పోర్ట్సు కౌన్సిలు

దిగువ వారు 7-4-62 నుంచి రెండు సంవత్సరాల పాటు ఆంధ్ర ప్రదేశ్ స్పోర్ట్సు కౌన్సిలు కార్యకర్తలుగాను, సభ్యులుగాను నియమింపబడాలని ప్రభుత్వం ఆదేశించినది

1. రాష్ట్ర రెవెన్యూ మంత్రి శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి, అధ్యక్షుడు; 2. ఎక్సైజ్, మద్య నిషేధ మంత్రి శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు; 3. ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి; 4 పోలీసు అదనపు ఇనస్పెక్టర్ జనరల్ శ్రీ శివకుమార్‌లాల్ ఐ. పి. ఎస్. 5. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర లెజిస్లేచర్ సెక్రటేరియట్ కార్యదర్శి శ్రీ జి. వి. చౌదరి; 6. ప్రభుత్వ సాధారణ పరిపాలన శాఖ ఉప కార్యదర్శి శ్రీ భరత్‌చంద్ ఖన్నా, ఐ. ఎ. ఎస్. 7. మేజర్ జనరల్ ఖుస్రో జంగ్ బహదూర్, సైఫాబాద, హైదరాబాదు; 8. హైదరాబాదులోని ఉస్మానియా యూనివర్సిటీ ఫి జి క ల్ డైరెక్టరు శ్రీ గౌస్‌మహమ్మద్; 9. శ్రీ డి. ఆర్. గోపాలరావు, విజయవాడ.



# పారిశ్రామిక విశేషాలు

[ రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామిక వేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షిక క్రింద యివ్వబడుతున్నవి. ]

## ప్రభుత్వ విభాగం

భారతీయ మందులు, ఫార్మసిటికల్సు లిమిటెడ్ (కేంద్ర ప్రభుత్వ సంస్థ) కి సల్ఫా మందులు, ఆసిటో జలక్టైడ్ (డయాకార్బ్), ఐసోనికొటనిక్ ఆసిడ్, ఫోనిక్ ఆసిడ్, విటమిన్లు బి-1, బి-2 లు, యితర ముఖ్య మందులు మున్నగువాని తయారీకై లైసెన్సు యివ్వబడినది. సోవియట్ రష్యా సాంకేతిక సలహాతో సనత్‌నగరంలో నెలకొల్పబడే యీ ఫ్యాక్టరీ సివిలు పనులు జరుగుతున్నవి.

## ప్రైవేటు విభాగం

ఆల్కలాయిడ్సు, హేపరిన్, పెన్టన్, డెక్ట్రిన్ ఇంజక్షన్‌ల తయారీ చేపట్టుటకై హైదరాబాదు వ్యాపార సంస్థ ఒకదానికి లైసెన్సు యివ్వబడినది. పంచదార మిల్లు యంత్రాలు, వుప వుపకరణాలు, పంపులు, పంచదార పరిశ్రమకు అవసరమైన అన్ని (టర్నింగ్) భాగాల తయారీకి హైదరాబాదులో ఒక సంస్థను నెలకొల్పుటకై ఒక ప్రైవేటు వ్యాపార సంస్థకుకూడ కేంద్ర ప్రభుత్వం లైసెన్సు నిచ్చినది.

## వస్త్ర పరిశ్రమ

తిరుపతిలోని తిరుపతి నూలు మిల్లు విస్తరణకై-ప్రస్తుతం వున్న 12,000 కదుళ్లుకాక అదనంగా మరి 9,000 కదుళ్లను స్థాపించుటకై — లైసెన్సు యివ్వబడినది

## పారిశ్రామిక సారా ఉత్పత్తి

పారిశ్రామిక సారా, అసిటోన్‌ల తయారీకై బెల్లూరులో గల పంచదార మిల్లుకి కేంద్ర ప్రభుత్వం లైసెన్సు యిచ్చినది. దీనితో, పారిశ్రామిక సారా లైసెన్సు శక్తి సాలుకి యించుమించు 64.79 లక్షల గ్యాలన్లు అవుతుంది.

## బొగ్గు పరిశ్రమ

1962 మార్చి నెలలో సింగరేణి బొగ్గు గనులు (ప్రభుత్వ కంపెనీ) 2,28,403 టన్నుల బొగ్గును ఉత్పత్తి చేసినవి

## నైజాం పంచదార ఫ్యాక్టరీ లిమిటెడ్

ఫ్యాక్టరీ కార్మికుల గృహాల నిర్మాణం జరుగుతున్నది.

కాన్పూరు జాతీయ పంచదార సంస్థ డైరెక్టరు శ్రీ ఎన్. ఎన్ గుండురావు సహకార సంఘాల రిజిస్ట్రారుతో కలసి 24-3-62 న యీ ఫ్యాక్టరీని దర్శించారు.



# ద్రోణ ధన్వి

శ్రీ పోచిరాజు శేషగిరిరావు

ఆతఁడొక యస్త్రవిశ్వ విద్యాలయమ్ము
ఆతని మేధయె పరిశోధనాలయమ్ము
ఆతఁడెఱుఁగని సూక్ష్మాంశమందులేదు
నిశితనిశితపుఁబ్రజ్ఞ వానిది సతమ్ము

అస్త్రశాస్త్రాది విద్యామహత్వమందు
నతని శిష్యులె లోకాన నవధులుంద్రు
వెలుఁగుదివిటీలు-కాంతిచిత్కాళల సరులు-
మేలిద్రోణునికీర్తి కామ్రేడితములు.

మూసగట్టిన క్షాత్రమ్ము-వేసమందు
పీసముడివోని ఛాందసవిప్రమూర్తి-
జన్నిదము పౌరుషమ్ముతోఁబన్నిదమ్ము
చఱచుననితోఁచు కాంతిని స్తంద్రగరిమ.

తఱుగని రాజభక్తి విశదమగుచుండును భ్రూయుగమ్మునన్
స్థిరతర చిత్తవృత్తి విరజిమ్మును లౌకిక కోవిదత్వమున్
అరిని సహింపఁడన్న దరుణారుణదీప్తములైన నేత్రముల్
ఎఱుకయొనర్చు సూక్ష్మముగ-నెంచఁగ శక్యమె ద్రోణుప్రౌఢతల్.

అరుణజవాశ్వముల్ ద్రుతతరాంచిత శక్తిసమున్నతమ్ములై
విరళవినోదకేళిమెయి వీథులవెంబడి పర్వులెత్త-ను
ద్ధురగతి ధూళి ధూసరిత ధూమ్రసమేతములైన మేనులన్-
కరములఁదాల్చి కళ్ళెముల-గాఢనిగూఢత ద్రోణుఁడొత్తినన్

రంగదుత్తుంగ తరంగ సంఘములతో
దఱులఁదాకెడు నదీదయితువోలె
అంబరమ్మును మోచి యత్యున్నతమ్మగు
గిరిరాజశేఖరు కీర్తివోలె

ఉదితాస్తమయవీధి నుజ్జ్వలమ్మగు మహా
నటరాజు దివ్యతాండవమువోలె
నింగియున్ నేలయున్ నేర్పుమై ముడివైచి
యఱచేతఁ జూపెడు సురగురువలె

నిలువబడియున్న యుపనిషణ్ణిచయమువలె
కాంతిలీనెడు నా ప్రభాకరుని కరణి
అస్త్రవిద్యకు గురువైన హరుని లీల
మహిమ గనుపట్టె కుంభ సంభవసుధ్వని

కయ్యపువేడుకన్ సమరకౌశలమున్ గడియించి-వీరసా
హాయ్యముపొందునోజను బ్రహర్షమనస్కృత భారతీయతల్
వియ్యములాడుచున్న కురువీరవరేణ్యుని గొల్వులోనఁదా
నియ్యకొనంగనేర్చెను గణింపక గైహికరాగభోగముల్

అనయము గొనయము వింటను
సునిశితమగు దృష్టి గుఱినిజూచి లగింపన్
స్వనితము జనితము కాఁగా
మును విడిచినయమ్మ హృదయమున్ బెకలించున్

సర్వశాస్త్రాళి పఠియించు సారమతుల
కూర్చియేర్చిన దండలోఁ గొలికిపూస;
భరతదేశాధి రాజన్య వరులనిండు
పెడదలన్ గాంతిరేఖ పండించుశశియ

ఉపనిషన్మధు ధారలొగి నుగ్గుఁబాలతో
గలిపి సేవించిన క్రమమూర్తి
ఇతిహాస పటుకథామృతముఁ జుబ్బనచూఱ
గాఁ గ్రోలి తనిసిన కర్మశీలి
తాత్త్వికగ్రంథ సందర్భమ్ము నిష్ఠమై
పట్టుతోఁ జదివిన ప్రచురమూర్తి
వేదవేదాంగముల్-విశ్వతోముఖముగా
నధ్యయనము చేసినట్టి ఘనుఁడు

చారుశీతల నవసుధా సారపూర
మానససరో మరాళికా మహిత మంజు
గతుల తారళ్య మొప్పు-నిక్వణములొలయు
వీణె-హార్దిక భారతద్రోణువాణి. ★

నా 'ద్రోణపుష్ప' కావ్యమునుండి

# వంకసన్నాలు

# పశ్చిమ గోదావరిలో వ్యవసాయ పరిశోధన

తాడేపల్లిగూడెం

వరిపంట, యెగుమతులలో భారతదేశంలో మిక్కిలి పెద్దదైన పశ్చిమ గోదావరి, వ్యవసాయ పరిశోధన విషయంలో కూడ యెప్పటివలెనే అగ్రస్థానంలో వున్నది.

ఈ స్థానిక వంక సన్నాలకు యెంతో గిరాకీవుంది. దక్షిణ భారత వ్యాపారస్థులు సాధారణంగా వీటిని బంగారు తీగెలు అంటారు. బొంబాయి, పశ్చిమ బెంగాలులలో వీటికి చంపాకలి అని పేరు. వీటికిగల గిరాకీ ఫలితంగా గడచిన కొన్ని సంవత్సరాలలో యీ రకం యెక్కువ విస్తీర్ణంలో పండించ బడుతున్నది. దాదాపు పండినపంట అంతా వుప్పుడు బియ్యం, బియ్యం రూపంలో కేరళ, మద్రాసు, మైసూరు రాష్ట్రాలకు యెగుమతి చేయబడుతున్నది. అస్సాం, బీహార్, బొంబాయి, కాశ్మీర్‌లలో వీటికి (నిబంధనలు సడలించిన పక్షంలో) గిరాకీ వుంటుంది.

ఈ రకం ప్రథమపంట, రెండవపంటలు రెండిటిలోను పండించబడుతుంది. రెండవ పంట యింతవరకు సాధారణంగా ఏప్రిల్–మే నెలల్లో నూర్చబడేది

వ్యవసాయ పరిశోధకుల సహాయంతో ఒక ధనిక రైతు యీ పంటకు మామూలుకంటె ముందుగా విత్తనాలుజల్లి ముందుగా పండించాడుట విజయవంతమైన ఈ ప్రయోగంలో యించుమించు 15 క్వింటాళ్ళు పంటపండినదట వచ్చే వ్యవసాయ ఋతువులో మరికొందరు రైతులు యీ పద్ధతి నవలంబిస్తారు. సమీప భవిష్యత్తులో యీ సన్న బియ్యం పంట ఫిబ్రవరి–మార్చిలోనే రావచ్చు.

* * *

తాడేపల్లిగూడెంకు దాదాపు 26 మైళ్ల దూరంలో గల మార్టేరులో నున్న వ్యవసాయ పరిశోధక క్షేత్రం–చలికాలంలో జల్లే అస్సాం, కాశ్మీర్ రకాలతో సహా–80 మిశ్రమజాతి వరి రకాలలో పరిశోధన సాగిస్తున్నదిట

* * *

తాడేపల్లి గూడెంకు దాదాపు 26 మైళ్ల దూరంలో కొల్లేరు సరస్సు ప్రాంతంలో పది సంవత్సరాలనాడు నెలకొల్పబడిన పూళ్ల వ్యవసాయక పరిశోధక క్షేత్రం ముంపుకు తట్టుకోగల వరిరకాలను యిదివరకే సాధించినది. కొల్లేరు ప్రాంతం యేటా వర్షాకాలంలో వరదలకు గురి అవుతుంది. అక్కడ నీరు నిలవ వుంటూ వుంటుంది,

పూళ్లక్షేత్రపు ధీర్ఘకాలిక వరిలో బర్మా అక్కుళ్లు 4.5 అడుగులలోతు నీటిలో బ్రతకగలవు. కొల్లేటి కుసుమ 8 అ. యెత్తు వరకు పెరుగుతుంది, మొక్క సగం నీటిలోను, సగం నీటిపైన వుంటుంది. ఇది కిచిడీసాంబ (మరొక సన్నరకం) కంటె ముందుపంటకి వస్తుంది మళ్లీ నీటికాలువ కొల్లేటికుసుమ కంటె ముందుపంటకి వస్తుంది.

ఈ రకాలు యిదివరకే ప్రాముఖ్యం పొందటంవలన తూర్పు గోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల్లో కూడ విస్తారంగా పండించబడుతున్నవి

పూళ్లలో సాధించబడిన స్వల్పకాలిక రకాలలో దాళ్వా కిచిడీ, కేరళ, మద్రాసు మైసూరు రాష్ట్రాల వ్యాపారస్థులు, వినియోగదారులకు ప్రీతి పాత్రమైనది

* *



# ప్రగతిపథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## అదిలాబాదు

### రోడ్డుకు పరిషత్తు గ్రాంటు

కానాపూర్ నుంచి లక్షణ్ చందావరకు గ్రామ పంచాయతీలు నిర్మించే 5 మైళ్ల పొడవుగల రోడ్డుకు జిల్లా పరిషత్ రూ. 56.000 లు మంజూరు చేసింది.

## చిత్తూరు

### రేణిగుంటలో కార్మికులకు భీమాపథకం

ఉద్యోగుల రాష్ట్ర భీమాపథకాన్ని రేణి గుంటలో ఏప్రిల్ 28 వ తేదీనుంచి 800 మంది ఫ్యాక్టరీ కార్మికులకు విస్తరింప చేశారు.

### హాస్టల్ బాలికలకు సెలవు శిబిరం

నెల్లూరు సాంఘిక సంక్షేమ బాలికల హాస్టల్ అధ్వర్యాన మే నెలలో తిరుమలై వద్ద ఒక సెలవు శిబిరం నిర్వహించబడింది.

### విద్యుచ్ఛక్తి సరఫరా విస్తరణ

చిత్తూరు తాలుకా చేర్లోపల్లి కుగ్రామమైన కమ్మపల్లెలో అరు వ్యవసాయావసరాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే ఒక ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించి, తత్సంబంధమైన పనులకై రూ. 14.750 లను కేటాయించింది.

## తూర్పుగోదావరి జిల్లా

### 20 మంది హరిజన బాలికలకు కుట్టుమెషిన్లు

రాజమండ్రి . దానవాయిపేటలోని కుట్టుపని కేంద్రంలో శిక్షణ పూర్తిచేసిన 20 మంది హరిజన బాలికలకు జిల్లా పరిషత్ అధ్యక్షులు గత ఏప్రిల్ నెలలో కుట్టుయంత్రాల విచ్చారు.

### ఆరోగ్య కేంద్రానికి విరాళం

రంగంపేటలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ప్రారంభించడానికి శ్రీ అడుసుమల్లి వెంకట సుబ్బారావు 4 వేల రూపాయలను, రెండెకరాల భూమిని విరాళంగా ఇచ్చారు. ప్రజలు కూడా ఆరువేల రూపాయలు విరాళం ఇచ్చారు.

### రాజమండ్రిలో ప్రణాళికా ప్రచార వారోత్సవం

హైదరాబాద్ లోని ఫీల్డ్ ఎగ్జిబిషన్ కార్యాలయం రాజమండ్రిలో గత ఏప్రిల్ లో ప్రణాళికా ప్రచారవారోత్సవాన్ని నిర్వ

హించింది. ఈ సందర్భంగా ఏర్పాటుచేసిన ప్రధమ, ద్వితీయ. తృతీయ ప్రణాళికల మ్యాపులు, చార్టుల ప్రదర్శనను 15 వేల మంది పైగా ప్రజలు సందర్శించారు.

## గుంటూరు

### గ్రామానికి విద్యుత్ సరఫరా

రేపల్లె తాలుకా పమిడిమర్రు గ్రామంలో ఒక పారిశ్రామిక సంస్థకు, ఒక వ్యవసాయ సంస్థకు, 22 గృహా వసరాలకు 20 వీధి దీపాలకు విద్యుచ్ఛక్తి సరఫరాచేసే ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించి తత్సంబంధమైన ఖర్చులకై రూ. 28,120 లను కేటాయించింది.

### ముట్లూరు గ్రామానికి విద్యుచ్ఛక్తి

గుంటూరుకు 12 మైళ్ళ దూరంలోగల ముట్లూరు గ్రామంలో విద్యుచ్ఛక్తి దీపాలకు గత మేనెలలో ప్రారంభోత్సవం జరిగింది.

### రైతుల దినోత్సవం

గిడ్డంగుల వారోత్సవంతోపాటు ఏప్రిల్ 18 వ తేదీన దుగ్గిరాలలో రైతుల దినోత్సవం కూడా జరిగింది. ఈ సందర్భంగా చర్చలు, సమావేశాలు జరిగాయి.

### ఒంగోలులో ఉద్యోగ సమాచార కేంద్రం

ఉద్యోగాల సమాచార పైలట్ పధకం విస్తరణ క్రింద ఒంగోలులోని పంచాయతీసమితి కార్యాలయంలో ఒక ఉద్యోగ సమాచార, సహాయక కేంద్రాన్ని ప్రారంభించారు. రాష్ట్రంలో ప్రారంభించిన ఏడు కేంద్రాలలో ఇది ఒకటి.

## హైదరాబాద్

### 13 గ్రామాలలో విద్యుచ్ఛక్తి

హైదరాబాద్ తాలూకా (పడమర) రాజేంద్రనగర్ పంచాయతీసమితిలో షంషాద్ సర్కిల్‌కు చెందిన 13 గ్రామాలకు విద్యుత్ సరఫరాను చిన్న గోల్కొండ గ్రామంలో ముఖ్య మంత్రి మే 9 వ తేదీన ప్రారంభించారు. ఈ సందర్భంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ ప్రతి గ్రామానికీ పాఠశాల విద్యుచ్ఛక్తి నీటి సరఫరా, రోడ్లు వంటి ప్రాధమిక సౌకర్యాలుండాలన్నారు. ఇట్టి వాటిలో పెక్కింటిని రాష్ట్రప్రభుత్వం సహాయాన్ని కోర కుండా స్థానిక స్థాయిలో పంచాయతీలు, పంచాయతీసమితులు ద్వారా సమకూర్చుకోవాలని ఆయన అన్నారు.

## ఖమ్మం

### ఉత్తమ గ్రామ సేవకుడు

బనిగండ్లపాడు గ్రామ సేవకుడైన శ్రీ మహమ్మద్ ఆలీని ఖమ్మం జిల్లాలో ఉత్తమ గ్రామ సేవకుడుగాను, ఆంధ్రప్రదేశ్‌లో నాలుగవ ఉత్తమ గ్రామ సేవకుడుగాను ప్రకటించారు. క్రింది పంచాయతీలను, జిల్లా బ్లాకుల వారీగా ఉత్తమమైనవిగా నిర్ణయించారు.

| | | |
|---|---|---|
| ఖమ్మం బ్లాకు | : | కొణిజెర్ల |
| మదిర .. | : | పెద్ద గోపవరం |
| కల్లూరు .. | : | కల్లూరు |
| వైరా .. | : | సోమవరం |
| పాలేరు .. | : | గట్టు సింగారం |
| తిరుమలాయపాలెం బ్లాకు | : | పిండిప్రోలు. |

## కృష్ణా

### శ్రమదాన వారోత్సవం

దివి తాలూకా, కోటపాలెం గ్రామవాసులు, ఉపాధ్యాయులు విద్యార్థులు కలిసి మే నెలలో శ్రమదాన వారోత్సవాన్ని నిర్వహించారు. ఒక ఎకరం పల్లపు ప్రాంతాన్ని మెరకచేశారు.

## కర్నూలు

### విద్యుచ్ఛక్తి సరఫరా

నందికొట్కూరులో 30 గృహావసరాలకు, 72 వీధి దీపాలకు విద్యుచ్ఛక్తి సరఫరా ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించి వాటి ఖర్చులకు రూ 35,280 లను కేటాయించింది.

## మహబూబ్‌నగర్

### పూర్వ విస్తరణ బ్లాకు ప్రారంభోత్సవం

నాగర్‌కర్నూలు తాలూకా రేవల్లి పూర్వ విస్తరణ బ్లాకుకు (ప్రీ-ఎక్స్‌టెన్షన్) ఆర్థిక మంత్రి ఏప్రిల్ 30 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

### జడ్చెర్లలో పరిశీలక శిబిరం

నాలుగు రోజుల పరిశీలక, యువజన శిక్షణ శిబిరాన్నొక దానిని మే రెండవ వారాన జడ్చెర్లలో నిర్వహించారు.

### గట్లు పనులు

ధన్వాడ, కల్వకుర్తి, గోకఫస్సల్వాద్, బిజ్నాపల్లి, కొత్తూరు, షాద్‌నగర్, జడ్చెర్లలలో 1961-62 సంవత్సరానికి రూ 1,13,500 ల ఖర్చుతో 4,500 ఎకరాలలో గట్లు నిర్మించే పని పూర్తయింది

## నల్గొండ

### గ్రామసహాయకుల శిక్షణ శిబిరం

నక్రేకల్ బ్లాకులోని కొర్లపాడులో ఏప్రిల్ 14 వ తేదీ నుంచి 18 వ తేదీ వరకు నిర్వహించిన శిక్షణ శిబిరంలో దాదాపు 50 మంది గ్రామ సహాయకులకు ఆధునిక వ్యవసాయ విధానాల్లోను పంచాయతీరాజ్య పరిపాలనలోను, సహకార విభాగాల్లోను శిక్షణ ఇచ్చారు.

### సంగీత నాటక పోటీ

నల్గొండలో ఏప్రిల్ 20,21 తేదీలలో జరిగిన చతుర్థ జిల్లా సంగీత నాటక పోటీలో నల్గొండ బహుళార్థ సాధకోన్నత పాఠశాల విద్యార్థులు ప్రదర్శించిన "నవోదయం" నాటకానికి ప్రథమ బహుమతి లభించింది.

### భువనగిరిలో కుటుంబ నియంత్రణ శిబిరం

కుటుంబనియంత్రణ ఓరియంటేషన్ శిబిరం ఒకదాన్ని ఇటీవల భువనగిరిలో మూడురోజులపాటు నిర్వహించారు. ఈ శిబిరంలో 50 మంది పైగా వాలంటీర్లు పాల్గొన్నారు.

## నెల్లూరు

### విద్యుచ్ఛక్తి సరఫరా

రాపూరు తాలూకా తిరుపండ్లలో 11 వ్యవసాయావసరాలకు రెండు పారిశ్రామికావసరాలకు విద్యుచ్ఛక్తిని విస్తరించే ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించి వాటికి సంబంధించిన ఖర్చులకై రూ. 59,600 లను కేటాయించింది.

## నిజామాబాద్

### ఉత్తమ గ్రామం

ఏప్రిల్ 20 వ తేదీన జరిగిన జిల్లాపరిషత్ సమావేశంలో ఆర్మూరు పంచాయతీసమితికి చెందిన అర్గుల్ గ్రామాన్ని జిల్లాలో ఉత్తమ గ్రామంగా నిర్ణయించారు.

## శ్రీకాకుళం

### సోంపేటలో అగ్నిమాపక కేంద్రం

సోంపేటలో ఒక తాత్కాలిక అగ్నిమాపక కేంద్రాన్ని ఏప్రిల్ 31 వ తేదీన ప్రారంభించారు. అగ్నిమాపక కేంద్రం నిర్మాణానికి ఈ పంచాయతీ కొంత స్థలాన్ని విరాళంగా ఇచ్చింది.

### పంచాయతీ సమ్మేళనం

ఆముదాల వలస ప్రథమ వార్షిక పంచాయతీ సమ్మేళనం మే 6,7 తేదీలలో జరిగింది.

## విశాఖపట్నం

### నీటి సరఫరా పథకానికి మంత్రి ప్రారంభోత్సవం

గంభీరంగడ నీటి సరఫరా పథకానికి మునిసిపల్ పరిపాలన మంత్రి మే 11 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఈ గంభీరంగడ నీటి సరఫరా పథకం గోస్తనీ నదికి సంబంధించింది. ఈ పథకం వల్ల వాల్తేరు, విశాఖపట్నాలకు నీరు పుష్కలంగా లభిస్తుంది.

### పార్కు ప్రారంభోత్సవం

విశాఖపట్నం ద్వారకానగర్ సహకార కాలనీలో ఒక ప్రాథమిక పాఠశాల భవనానికి, ఒక పార్కుకు పురపాలక పరిపాలన మంత్రి మే నెలలో ప్రారంభోత్సవం చేశారు.

### వడ్డాదిలో పబ్లిక్ కాల్ ఆఫీసు

వడ్డాది పోస్టాఫీసువద్ద ఒక పబ్లిక్ కాల్ ఆఫీసును గత ఏప్రిల్ నెలలో ప్రారంభించారు.

## వరంగల్

### జిల్లా పరిషత్ సమావేశం

జిల్లా పరిషత్ స్థాయీసంఘం మే 10వ తేదీన సమావేశమై 1962-63 ఖరీఫ్ ఉద్యమానికై రెండులక్షల రూపాయలను పంచిపెట్టడానికి తీర్మానించింది. తక్కావీ ఋణాలు, ఆయిల్ ఇంజన్లు, విద్యుత్ సంపుసెట్లకు 1962లో 80 వేల రూపాయలు కేటాయించారు. 50 చిన్నతరహా నీటి పారుదల కార్యక్రమాలను, రూ. 2,39,284 ల అంచనా ఖర్చుతో ఆమోదించడానికి కూడా ఈ సంఘం తీర్మానించింది.

## పశ్చిమ గోదావరి

### పాఠశాల భవనప్రారంభం

పండల పర్రులో ప్రాథమిక పాఠశాల నూతన భవనాన్ని నిడదవోలు పంచాయతీసమితి అధ్యక్షులు మే 3వ తేదీన ప్రారంభించారు.

### పంచాయతీభవన ప్రారంభోత్సవం

తణుకుకు మూడుమైళ్ళ దూరంలోవున్న వడ్లూరు గ్రామ పంచాయతీ బోర్డు భవనాన్ని మే మొదటివారంలో ప్రారంభించారు. సేకరించిన 35 వేల రూపాయల ధనంతో ఈ భవనాన్ని నిర్మించారు.

### "ప్రజల ప్రణాళిక" ప్రదర్శన

"ప్రజల ప్రణాళిక" అనే ఒక వారం రోజుల ప్రదర్శనను తాడేపల్లి గూడెంలో ఏప్రిల్ నెలలో ఏర్పాటు చేశారు. అనేక ఛార్టులు, మ్యాపులువున్న ఈ ప్రదర్శనను హైదరాబాద్‌లోని ఫీల్డ్ ఎగ్జిబిషన్ కార్యాలయంఏర్పాటు చేసింది.

### తీవ్రతర అభివృద్ధి ఉద్యమం

పశ్చిమ గోదావరి జిల్లాలో లఘు పరిశ్రమలను ప్రారంభించడానికై ఒక తీవ్రతర అభివృద్ధి పథకాన్ని లఘుపరిశ్రమల మంత్రి డాక్టర్ యం. యస్. లక్ష్మీనరసయ్య మే నెలలో ఏలూరులో ప్రారంభించారు.

# పంచాయతీరాజ్య పురోగమనం

## కుటీర పరిశ్రమలు

కోటఉరట్ల పంచాయతీసమితిలోని 8 మంది వడ్రంగివారికి 0 శాతం విరాళం ప్రాతిపదికపై ఏప్రిల్ నెలలో ఆధునిక రికరాలు సరఫరా చేయబడినవి. కుటీర పరిశ్రమల అప్పు బంధనల క్రింద 9 మంది వడ్రంగి వారికి రూ. 100 అప్పు ఇవ్వబడినది.

## టీకాల ఉద్యమం

చినక్రాక పంచాయతీసమితిలోని జలదంకి గ్రామంలో శూచిని నిరోధించే ఉద్దేశంతో ఏప్రిల్ నెలలో 2,000 మందికి రోగ్య పారిశుద్ధ్య ఉద్యమం క్రింద, టీకాలు వేయబడినవి. పైన, మూడు గ్రామాలలో మూడు శ్రమదానోద్యమాలు జరుప డినవి. వీటిలో గ్రామీణులు, బ్లాకు సిబ్బంది పాల్గొన్నారు.

## తోలు పదును ప్రదర్శనా కేంద్రం

తోలు పదునుకు ఆధునిక పద్ధతుల నవలంభించుటకై తోలు గొల్త, వంశ పారంపర్యమైన పనిమంది చేతిపనివారికి శిక్షణ చ్చుటకై ఆదిలాబాదు పంచాయతీసమితి ఒక తోలుపదును ప్రద ర్శన–శిక్షణా కేంద్రాన్ని ప్రారంభించినది. ఈ పథకానికి రూ. 11,800 ఖర్చు కాగలవని అంచనా.

## పారిశుద్ధ్యోద్యమం

కాచిరాజుగూడెం యువకమండలి సభ్యులు తిర్మలాయ పాలెం పంచాయతీసమితిలోని తమ గ్రామంలో మూక ఉమ్మడి పారిశుద్ధ్యోద్యమాన్ని ప్రారంభించారు. దీని ఫలితంగా రాళ్ల రప్పలు తొలగి వీధులు బాగుపడినవి. ఈ పథకం లాభాలను గ్రామీణులు పొందడానికి వీలుగా నిర్ణీత గ్రామాలలో యిట్టి ఉద్య మాలను నడపాలని సంకల్పించబడినది.

## కంపోస్టుయెరువు గుంటలు

పర్కాల పంచాయతీసమితిలో, స్వయం సహాయ కార్య క్రమం క్రింద ఏప్రిల్ నెలలో కంపోస్టు యెరువు గుంటల ఉద్య మం ప్రారంభించబడినది. కొన్ని గ్రామాలలో దాదాపు 30 యింటి తోటలు వేయబడినవి. చేదంపుడు సంఘం నిమిత్తం షయాం పేటలో ఒక విక్రయ భండారం ప్రారంభింపబడినది.

## విస్తృత పౌష్టికాహార కార్యక్రమం

బన్సవాడ పంచాయతీసమితిలో నిర్ణీత గ్రామాలన్నిటికి ఏప్రిల్ నెలలో, కాయ కూరలతో పాటు 637 పౌనుల చేపలు సర ఫరా చేయబడినవి. నాచపల్లి, కామశెట్టిపల్లి, చిర్కూరు, తామా పురం ఖుర్దులలో కమ్యూనిటీ రేడియో సెట్లు నెలకొల్పబడినవి.

## రసాయనిక యెరువులు

నగరి పంచాయతీసమితిలో ఆధునిక వ్యవసాయ పద్ధతుల క్రింద, 1962 ఏప్రిల్ నెలలో రైతులకు 54 మణుగుల రసాయన యెరువులు, 63 మణుగుల నూనె పిట్టు సరఫరా చేయబడినవి. సహ కారం విషయంలో 42 కొత్త కుటుంబాలు సహకారరంగం క్రిందికి తేబడినవి రూ. 926 లు వాటా మూల ధనం క్రింద సేకరించ బడినవి. ఆ పైన, వివిధ వ్యవసాయ ప్రయోజనాలకై రైతులకు అప్పుల క్రింద రూ. 30,120 యివ్వబడినవి.

## బావి మరమ్మతు

మద్దిపాడు పంచాయతీసమితిలోని దొడ్డవరం, ఇనమన మెళ్ళూరులలో ఏప్రిల్ నెలలో 27 పశువులకు విత్తు కొట్టబడినది. మద్దిపాడు గ్రామంలో ఒక బావి మరమ్మతు చేయబడినది. రెండు ఫర్లాంగుల నిడివిగల కచ్చారోడ్డు నిర్మించబడినది.

## ప్రత్యేక సంక్షేమ నిధి

ప్రజల నుంచి రూ. 20 లను విరాళాలుగా సేకరించి ప్రతి పంచాయతీ, నారాయణఖేడ్ పంచాయతీసమితికి ప్రత్యేక సంక్షేమ నిధి నిమిత్తం యివ్వాలని ఏప్రిల్ 30 న జరిగిన సమావేశంలో నారాయణఖేడ్ పంచాయతీసమితి తీర్మానించినది. ఈ విధంగా సేకరించబడిన డబ్బు మొత్తం బ్లాకుకు సముష్టిగా వుపకరించే సంక్షేమ పనులకై ఖర్చు పెట్టబడుతుంది.

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1962 మార్చి నెలలో కమ్యూనిటి రేడియో సెట్లు స్థాపించబడిన గ్రామాలు, సంస్థల వివరాలు దిగువ పొందుపరుపబడినవి

| వరుస సంఖ్య | జిల్లా పేరు | తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటి రేడియో సెట్లు స్థాపించబడిన తేదీ |
|---|---|---|---|---|
| 1. | పశ్చిమ గోదావరి | ఏలూరు | వసంతవాడ I | 22 3.62 |
| 2 | , | తణుకు | దమ్మేరు | 27.3 62 |
| 3. | .. | నర్సాపురం | కొప్పర్రు II | 27 3 62 |
| 4. | .. | .. | వెలివెల | 28 3 62 |
| 5. | .. | చింతలపూడి | బుర్రంపాలెం | 29.3 62 |
| 6. | .. | .. | ప్రగడవరం II | 29.3 62 |
| 7. | .. | .. | .. III | .. |
| 8. | .. | .. | తిరుమలదేవిపేట | .. |
| 9. | .. | .. | వెలసపాడు | 30.3 62 |
| 10. | .. | నర్సాపురం | తురుపుతళ్ల | 30.3.62 |
| 11. | .. | భీమవరం | అర్దమూరు | 30.3.62 |
| 12. | .. | చింతలపూడి | ఎడవల్లి | 30 3.62 |
| 13. | .. | .. | గుండుగొలనుకుంట | 30.3.62 |
| 14. | .. | .. | గుంటపల్లి | 30.3 62 |
| 15 | .. | .. | కొళ్లచెరువు | 30 3 62 |
| 16. | .. | తణుకు | ఏడూరు | 30 3 62 |
| 17. | .. | భీమవరం | తాడేరు II | 31 3 62 |
| 18. | .. | చింతలపూడి | బోగోలె | 31 3 62 |
| 19. | .. | నర్సాపురం | వేములదేవి II | 31 3 62 |
| 20. | .. | భీమవరం | కొందేపూడి | 31 3 62 |
| 21. | .. | చింతలపూడి | చింతలపూడి II | 31 3 92 |
| 22. | .. | .. | .. III | , |
| 23. | ఖమ్మం | ఖమ్మం | తల్లంపేడు (పొన్నేకల్) | 20 3.62 |
| 24. | ఆదిలాబాదు | ఆదిలాబాదు | ఇచ్చోడు | 11 3 62 |
| 25 | మెదక్ | మెదక్ | అనసానిపల్లి | 19.3.62 |
| 26. | .. | సిద్ధిపేట | జంగిపల్లి | 31 3 62 |
| 27. | .. | .. | తిమ్మాపురం | 31.3.62 |
| 28. | .. | గజ్వేల్ | దిలాపురం | 31.3.62 |
| 29. | .. | .. | సింగోటం | 31 3.62 |

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

ఏప్రిల్ 26 : చతుర్థ ఆంధ్రప్రదేశ్ సర్వోదయ సమ్మేళనాన్ని గవర్నర్ విజయవాడలో ప్రారంభించారు.

ఏప్రిల్ 28 : లఘుపరిశ్రమలు, అత్యవసరాలకు సంబంధించిన వాటికి విద్యుచ్ఛక్తి కోతను సడలించడానికి, అంత అవసరంలేని ఇతర సంస్థలపై క్రొత్త విబంధనలు విధించడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది.

ఏప్రిల్ 29 : హైదరాబాద్‌లో జరిగిన అఖిలభారత వార్తా పత్రికసంపాదకుల మహాసభ స్థాయీ సంఘానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

మే 7 : పశ్చిమ గోదావరి జిల్లాలో లఘుపరిశ్రమలను ప్రారంభించడానికి సంబంధించిన ఒక తీవ్రతర అభివృద్ధి పథకానికి లఘుపరిశ్రమల మంత్రి ప్రారంభోత్సవం జరిపారు

మే 11 : విశాఖపట్నానికి 10 మైళ్ళ దూరంలోగల గంభీరంగడ్డ నీటి సరఫరా పథకాన్ని పురపాలక పరిపాలన మంత్రి ప్రారంభించారు.

మే 20 : న్యాయ సమాచార శాఖల మంత్రి వరంగల్‌లో జిల్లా సమాచార కేంద్రాన్ని ప్రారంభించారు.

## భారతదేశంలో

ఏప్రిల్ 23 : 1962–63 సంవత్సరం బడ్జెట్‌ను కేంద్ర ఆర్థికమంత్రి లోకసభకు సమర్పించారు.

చైనా భారత భూభాగాన్ని ఖాళీచేసి, 1954 లో వున్న ప్రశాంత పరిస్థితి తిరిగి ఏర్పడినప్పుడే టిబెట్ ప్రాంతంలో నూతన వాణిజ్య ఒప్పందానికవకాశముందని భారతదేశం చైనాకు తెలిపింది. చైనాకు భారతదేశం ఏప్రిల్ 11 వ తేదీన ఇచ్చిన సమాధానాన్ని ఈరోజు రాజ్యసభకు సమర్పించారు.

మే 4 : రైల్వే బడ్జెటును లోకసభ నేడు ఆమోదించింది.

మే 6 : కేంద్ర మంత్రివర్గంలో మరొక 12 మంది క్రొత్త సభ్యులను నియమించారు. దీనితో కేంద్ర మంత్రివర్గ సభ్యుల సంఖ్య 49 కి పెరిగింది.

మే 7 : బీహార్ గవర్నర్, ప్రముఖ విద్యావేత్త అయిన డాక్టర్ జకీర్ హుస్సేన్ భారత ఉపరాష్ట్రపతిగా ఎన్నికైనారు.

మే 11 : డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ భారత రిపబ్లిక్ రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు

మే 13 : డాక్టర్ రాధాకృష్ణన్ భారత రాష్ట్రపతిగా పదవీ ప్రమాణస్వీకారం చేశారు.

12 సంవత్సరాల పాటు భారత రాష్ట్రపతిగా వుండపదవి నుంచి విరమించిన డాక్టర్ రాజేంద్రప్రసాద్ నేడు పాట్నాకు బయలుదేరి వెళ్ళారు.

మే 16 : కోయినా జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు మొదటి టర్బో–జనరేటర్‌ను మహారాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు.

## విదేశాలలో

ఏప్రిల్ 30 : ఏప్రిల్ ఆఖరు వారంలో తూర్పు పాకిస్తాన్‌లోని రాజషాహీ జిల్లాలో ప్రమాదాలవల్ల ఏడుగురు మృతిచెందారని, 13 మంది గాయపడ్డారని, పాకిస్తాన్ వార్తా సంస్థ ప్రకటనవల్ల తెలుస్తున్నది.

కాశ్మీర్ సమస్యపై భారత, పాకిస్తాన్‌ల వాద ప్రతివాదనలు విన్న తరువాత భద్రతా సంఘం సమావేశాన్ని వాయిదా వేసింది,

మే 14 : ఇండొనీసియా ప్రెసిడెంట్ సుకర్నో ఒక ప్రార్థనా సమావేశంలో వుండగా ఒక ముస్లిమ్ ఉన్మాది ఆయనను హత్యచేయ ప్రయత్నించాడు.

మే 15 : భద్రతా సంఘం కాశ్మీర్ సమస్యపై చర్చను తిరిగి ప్రారంభించింది.

మే 18 : ప్రెసిడెంట్ అయూబ్‌ఖాన్ నూతన పాకిస్తాన్ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

మిగుల్చుకున్నమీరు డబ్బును

భారత ప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

భారత దేశంయొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్ప నదీలోయ ప్రాజెక్టులకు,

రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!

**12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు**

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. రూ. 25,000 ల విలువ పత్రాలు ప్రావిడెంటు ఫండ్ పెట్టుబడులకు మాత్రమే.

**10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు**

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

**15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు**

జారీ చేయబడు ధరలు: రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. ఈ సొమ్ము నూటికి యేడాదికి 4.25 కు కొంచెమెక్కువగా వచ్చే చక్రవడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. ఒక్కొక్కరురూ. 36,600 ల వరకూ కొనవచ్చు.

**పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు**

25 నుంచి 10,000 ల వరకు గల నిల్వలపై నూటికి 2½ చొప్పున, రూ. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2 చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.

**క్యూములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం**

నెలనెలా రూ. 5, 10, 20, 50, 100 లేక 200 వంతున 5 లేక 10 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే, వడ్డీతోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికి వస్తుంది.

**ఐదేండ్ల వడ్డీలేని బహుమతి బాండ్లు**

1965 ఏప్రిల్ 1న ఎంత విలువ బాండ్లుకొన్నారో అంత మాత్రమే తిరిగి ఇవ్వబడుతుంది.

బాండ్లు రూ. 100, రూ. 5 ల విలువగలవి వరుసగా జారీచేయబడుతాయి. లాట్లు మూడు నెలల కొకసారి అంటే ప్రతి సంవత్సరం జూన్ 1 న, సెప్టెంబరు 1 న, డిసెంబరు 1 న, మార్చి 1 న డ్రా వేయబడుతాయి. డ్రానిబట్టి ప్రతిసారి రూ. 100 లు విలువజేసే 1 లక్ష బాండ్లకు 40 బహుమతులు. రూ. 5 లు విలువజేసే 10 లక్షల బాండ్లకు 278 బహుమతులు ఇవ్వబడుతాయి.

ఆదాయంపన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది: భావిభారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఈ పెట్టుబడులకు సంబంధించిన నిబంధనలను గూర్చి యితర వివరాలు మీకు చేరువగా వున్న పోస్టాఫీసు వద్దగాని రీజియనల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసర్, 10-2-2, ఎ.సి. గార్డ్సురోడ్డు, హైదరాబాదు, లేక, మీ జిల్లా కలెక్టరు ఆఫీసులోని, జిల్లా ఆర్గనైజరు వద్దగాని తెలుసుకోవచ్చు.

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సమాచార, ప్రజాసంబంధశాఖ, హైదరాబాదు

### పట్టిక

ఇంగ్లీషు

| | | రూ. న. పై |
|---|---|---|
| 1. అరకులోయ | ... | 0 — 60 |
| 2. ఆంధ్రప్రదేశ్—విశేషాలు | ... | 0 — 25 |

తెలుగు

| | | |
|---|---|---|
| 1 శ్రీ అల్లూరి సీతారామరాజు జీవితచరిత్ర | ... | 2 — 75 |
| 2. 'ప్రగతి గీతాలు' | ... | 0 — 25 |
| 3. మూడవ మెట్టు | ... | 0 — 25 |

ఉరుదు

| | | |
|---|---|---|
| 1. ఆహారోత్పత్తి | ... | 0 — 12 |
| 2. గిరిజన సంక్షేమం | ... | 0 — 12 |
| 3. మత్స్యసంపద | ... | 0 — 12 |

పోస్టేజి అదనం

ప్రతులను సమాచార, ప్రజా సంబంధ శాఖ

సమాచార కేంద్రంనుంచి పొందవచ్చు.

## గ్రంథసమీక్ష

# "సాహిత్య రత్నాలు"

రచన: శ్రీ పి. వి. రత్నం. బి. ఏ. ప్రచురణ: ప్రసాద్ పబ్లికేషన్స్, ఏలూరు. మొత్తం నాలుగు సంపుటాలు. వెల: ఒక్కొకటి 75 నయాపైసలు, పాకెట్ సైజు.

సాహిత్య రత్నాలన్న పేరుతో తెలుగు సాహిత్యంలో అగ్రగణ్యులైన కొందరు రచయితలను శ్రీ రత్నం ఈ గ్రంధంలో పరిచయం చేశారు. రచయిత తానూహించిన రత్నాలను నాలుగు సంపుటాల్లో సమకూర్చారు. ఇందులో ప్రధమ సంపుటంలో శ్రీయుతులు బోయి భీమన్న, గోపీచంద్, రెండవ సంపుటంలో శ్రీయుతులు శ్రీశ్రీ, నార్ల, కరుణశ్రీ, గొర్రెపాటి, తృతీయ సంపుటంలో శ్రీయుతులు విశ్వనాధ, చలం, దాశరధి, నాలుగవ సంపుటంలో శ్రీయుతులు ఆరుద్ర, కాశీ విశ్వనాధం, కొనకళ్ల గారలను గూర్చి వారివారి ఆశలు-ఆశయాలు, వారి రచనలు-అందలి నైపుణ్యం, ఆ రచనల్లోని పూర్వాపరాలను గూర్చి సమగ్రంగా చర్చించారు.

"విమర్శ కూడా ఒక కళయే" నని కొందరు ఆధునికులు ప్రబోధిస్తున్న నగ్నసత్యం శ్రీరత్నం విమర్శలను చదివిన ప్రతి ఒక్కరూ తప్పక విశ్వసించేటంతగా, యీ విమర్శ గ్రంధ సంపుటి రూపొందించబడింది.

విమర్శకుడు ఎలా వుండాలో చదువరులకు సులభంగా అవగాహన మవుతుంది.

"నా దొక సొంతస్కూలు" అని చెప్పుకొన్న శ్రీ భీమన్న తన రచనలన్నింటిలో అడుగడుగునా గోచరించే మృదు పదజాలాన్ని, క్షణక్షణంలో స్ఫురించే అభిప్రాయ సముదాయాన్ని విపులీకరించి ఆయనది నిజంగా "ఒక సొంతస్కూలే" నని నిరూపిస్తారు.

ఆవిధంగానే కథానికరచయితగా, నవలా రచయితగా పేరు పొందిన శ్రీ గోపీచంద్ వ్యాసంలో కూడా, వారి రచనలను అందలి మాధుర్యాన్ని చాకచక్యంతో చమత్కరించి, పాఠకులను మైమరపించి చివరకు "గోపీచంద్ గొప్పఆలోచనాపరుడు. అనమాన ప్రతిభావంతుడు. యువరచయితలకు నిఘంటువు పాఠకులకు వేగుచుక్క." అని నాలుగు మాటల్లో గోపీచంద్‌ను సంక్షిప్తం చేస్తారు.

సాహిత్యంలో సింహగర్జనలు చేసిన శ్రీశ్రీ సింహగర్జనలు ఎలాంటివో, అవి ఎలా ప్రజలను రంజింప చేశాయో, భూమిని కూడా ఆ రచనలు ఎలా కంపింప చేశాయో విమర్శకులు 'శ్రీశ్రీ' వ్యాసంలో విపులీకరించారు.

తెలుగు పత్రికారంగంలో అసమాన ప్రతిభాశాలిగా శ్రీనార్లను అద్భుతంగా చిత్రిస్తాడు అంతేకాదు. "అతనిలా ఎంతమంది వ్రాస్తారు?" పాఠకులను సూటిగా ప్రశ్నిస్తాడు. అందుకే నార్లకలం గాండీవమనీ, సంపాదకీయాలు శంఖా రావాలనీ వర్ణిస్తాడు. అంతే కాదు' "ప్రతిగ్రామంలో రామాలయంపేరు వున్నట్లు, నార్లపేరు ప్రతిఊర్లో వినిపిస్తుందనటం" ఎంతో సహజంగావుంది.

కరుణశ్రీని పరిచయం చేసిన వ్యాసంలో ఆయన్ను తెలుగు బాషకు తియ్యదనం తెచ్చిన ఒక సాహిత్యవేత్తగా పేర్కొంటూ తెలుగు సాహిత్యంలో ఉత్తరదక్షిణ ధృవాలుగావున్న. విశ్వనాధ, శ్రీశ్రీగారలకు మధ్య భూమధ్యరేఖగా రూపొందిస్తాడు. 'ఆడంబరం. అల్పత్వం' లేని ఉత్తమకవి 'కరుణశ్రీ' అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పేస్తాడు.

శ్రీ గొర్రెపాటిని సాహిత్యంలో మంచిచెడులు ఎత్తిచూపగల ప్రతిభాశాలియని విమర్శకుడు వర్ణిస్తాడు

శ్రీ విశ్వనాధను చూచి తెలుగుదేశం గర్వపడుతుందనీఅందుకు కారణం ఆయన 'లక్షలాది మాటలతో వేలాది పేజీలు వ్రాయటమేనని', విశ్వ

వారిలో మహత్తరమైన కల్పనా శక్తి, బ్రహ్మాండమైన భావనా శక్తి తొణికిసలాడుతున్నాయనీ వివరిస్తాడు.

చలాన్ని పరిచయంచేస్తూ, ఆయన సమాజంలో దుమారం లేపాడనీ, అతని కలంలో చాతుర్యంవున్నా, అతని పాత్రలు పాఠకుల సానుభూతి పొందలేవనీ విమర్శిస్తాడు.

దాశరథిని కవితలో ఉపన్యసించగల ఉద్దండుడుగా వర్ణిస్తూ ఆయన రత్నాలవీణ మీటిన సంగీతధ్వనులు మాటల మంటలే కాదనీ, భవిష్యత్తును పండించే రత్నాలపంటలు, గుండెల గంటలు, జాలిగుండెల బాటలనీ కూడా అభివర్ణిస్తాడు.

చిత్రలోకంలో రచయితగా ప్రసిద్ధికెక్కిన శ్రీ ఆరుద్ర ఆహ్లాదం కలిగిస్తాడనీ, ఆయన ఉపమానాలు అందచందాలలో కూడ ఏ కవీ వూహించనంత ఉజ్వలంగా వుంటాయని ప్రశంస్తాడు. ఆయన రచనల్లో విషాదం, విప్లవం కనిపించవనీ, కొంచెం వేదనా—అదీ మూగవేదనా తొంగిచూస్తూందనీ కూడా విమర్శకుడు వ్యాఖ్యానిస్తాడు.

ఈ గ్రంధ సంపుటి "సాహిత్య రంగంలో సరిక్రొత్త బాటలు వేస్తున్న" శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాధం, "జానపద సాహిత్యంలో అందెవేసినచెయ్యి" అయిన శ్రీ కొనకళ్ల గారల వ్యాసాలతో ముగింపుజరిగింది.

ఈ గ్రంధ సముచ్చయం ప్రముఖ విమర్శకులు, పత్రికా రచయితలు శ్రీ కంబాల తాతారావుగారికి అంకిత మివ్వటం సమంజసంగా వుంది.

"హృదయం"

* * *

## కాశీ విశ్వనాధం రచనలు

తెలుగులో కాశీమజిలీ కధలు, వాటినే పోలిన అరేబియన్ నైట్స్ కధలూ, దయ్యాలూ—దేవతల కధలూ బాల సాహిత్యానికి ఒక పుష్టి బాలురకొక తుష్టీ యిస్తున్నప్పటికీ ఆధునిక బాల సాహిత్యం పాశ్చాత్య దేశాల్లో రూపు దిద్దుకున్నట్లు మన భాషలోనే కాదు—మన దేశంలోనే—రూపు దిద్దుకోలేదని తద్జ్ఞులు చెబుతున్నారు.

తెలుగు బాలసాహిత్య నిర్మాతల్లో ఒకరుగా శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాధం యిటీవల కొన్ని పుస్తకాలు వ్రాశారు. బాలలకు అద్భుత గాధలంటే విశేషాసక్తి ఉంటుందన్న విషయం నిర్వివాదాంశమే అయినప్పటికీ జాతీయతా ప్రబోధ రూపమైన దేశభక్తి గాధల్ని వాళ్ళకు అనువుగా చెప్పడం కూడా అవసరమే; వాళ్ల ఆసక్తిని తీర్చడంతో పాటు వాళ్ళను ఋజుపధాన నిలిపే ప్రయత్నం చెయ్యడం కూడా ముఖ్యం. శ్రీ కాశీవిశ్వనాధం తమ రచనల ద్వారా బాలల్లో జాతీయ దృక్పధాన్ని సృష్టించడానికి సలిపిన కృషి ప్రశంసనీయం. బాలసాహిత్యమంటే విషయం తక్కువ, బొమ్మలెక్కువా ఉండాలని ఒక ఉద్దేశం; పెద్దపెద్ద అక్షరాల్తో ముద్రణ ఉండాలని మరో అభిప్రాయం; వచనంలోకన్న గేయ రీతిలో నడవాలని ఇంకొక భావన; అద్భుత వీరరసాన్ని తొణికిసలాడించాలని వేరొక తాత్పర్యం—ఇలా బాలసాహిత్యంలో ఉండవలసిన విషయం గురించి కన్నా తీరుతెన్నులు, పణితులు, పక్కీలను గురించిన దృక్పధాలెక్కువ చర్చనీయాంశాలవుతున్న యీ రోజుల్లో శ్రీ కాశీవిశ్వనాధం పుస్తకాలు బాలసాహిత్య నిర్మాణంలో విషయం వైపునకు దృష్టి మళ్లించేవిగా ఉన్నాయి.

"తాత—మనుమడు", "అమ్మా—కొడుకూ" అను రెండు పుస్తకాలు ఆయన వ్రాశారు. వాటి ద్వారా గేయ ఫణితిలో భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను బాలలకు కరతలామలకం చేశారు. "తాత మనుమడు" పుస్తకంలో ఆయన మన స్వాతంత్ర్యసమరంలోని విప్లవకారుల ఆత్మ బలితత్వం స్పష్టీకరించారు బ్రిటిష్ సామ్రాజ్యాన్ని బాంబులతో బులెట్లతో ఎదిరించడానికి ప్రయత్నించి ఎందరెందరో వీరులు నేలకొరిగారో ఆయన యీ పుస్తకంలో తెలిపారు. మన స్వాతంత్ర్యసమరం కేవలం అహింసా ప్రాతిపదిక మీద మాత్రమే జరిగిందనుకొనే వారికీ పుస్తకం ఎందరో విప్లవ వీరుల్ని పరిచయం చేస్తుంది. సత్యాగ్రహోద్యమమే కాకుండా బ్రిటిష్ పాలనకు విప్లవించిన వీరులింతమంది మన చరిత్రలో ఉన్నారా అని ఆశ్చర్యం కొలిపేట్లుగా శ్రీ కాశీవిశ్వనాధం మన విప్లవ వీరులకు శ్రద్ధాంజలి ఘటించారు బాలలకు మన విప్లవంలోని త్యాగాన్ని దేశభక్తిని పరిచయం చేశారు. ఒక్కొక్క విప్లవ వీరుడొక్కొక్క మెరుపుతీగెగా వెలిగాడు.

అదే ఆయన చివరకంటారూ—
కాంతికిరణ ప్రపుంజమయ్యెది
కళనసిసుచు కానిపించియు
అస్తమించిన దంతలోననె
కాంతిగాంచిన కన్నులింకను
మసకలన్ మిరుమిట్లు గొల్పెడి
చిట్టిబాబూ ! చరితమిదిరా !

దీనితో బాటు భారత స్వాతంత్ర్య సాధనకు మహోద్యమాన్ని సాగించి ప్రజల్ని చైతన్యపరుల్ని చేసిన కాంగ్రెసు చరిత్రాన్ని తేలిక గీతాల్లో ఆయన "అమ్మా కొడుకు" పుస్తకంలో పొందుపరిచారు. కాంగ్రెసు మహాసభలూ, వాటి అధ్యక్షులూ, కాలక్రమేణా కాంగ్రెసు విధానాల్లో వచ్చిన ఒడుదుడుకులూ అన్నీ ఆయన స్థాలీపులాకంగా యీ పుస్తకంలో ప్రస్తావించి కాంగ్రెసు చరిత్రను బాలలకోసం సింహావలోకనం చేశారు.

కాంగ్రేసు సంఘంబు
విశ్రాంతి గైకొనగ
విడిదికే తెంచెనా ?
విసువుడిగి జనతలో
విహరించుచుండెనా-అని కొడుకు ప్రశ్నిస్తే
ఆర్థిక సమానతను
ఆర్జించ సమకట్టి
పోరాడతోందిరా- అని అమ్మ జవాబిస్తుది

కాని ఈ పద్ధతి రచనల్లో పేర్లను మాత్రాఛందస్సులోనైనా సరే ఇమిడ్చినప్పుడొక్కొక్క వికృతి కనిపిస్తుండడం కద్దు. కాంగ్రెసును, కాంగ్రేసు అని మార్చుకోవాల్సి వస్తుందికదా ! అశ్వనీకుమారదత్తు పేరు ఛందస్సుకోసం కౌమారదత్తుగా మార్చుకోవాల్సి వచ్చింది. ఇలాంటి ఒక స్వల్ప వికృతి తప్ప యీ రెండు రచనలూ లయాన్వితంగా సాఫీగానే నడిచాయి.

"బిస్కెట్లు" అను పుస్తకం బాలలకు నడవడిని నీతి సిద్ధాంతాలనూ బోధించే రచన. కుమార కుమారీ శతకాల్లోని సారాంశాన్ని గేయ రూపంలో రచయిత అందించారు.

వీధియంగడి కూళ్ళు కుడువక
కొంటె మూకల జంట గాడక
రౌడి వెధవల నెదర జంకక
నీకు నీవుగ జగడమాడక
పిరికితనమును యెడదజేర్చక
శీల సంపద శిధిలపరచక
సత్పథమ్మున సాగువత్సా !- ఇలా సాగిపోతుందీ రచన

బాల్యాన్ని నిర్వచిస్తూ శ్రీ కాశీవిశ్వనాథం "బిస్కెట్ల" పుస్తకంలో అన్న ఈ క్రింది మాటల్లో సున్నితమైన కవితా ధోరణి కూడా విశ్వసిస్తున్నది.

సుమ శరీరము సౌరభమ్మున
మానవాకృతి మహివిదాల్చుట
కాంచి పూవుల గగురుపాటున
తన్మయత్వము కాంచుచుండును.

మరో పుస్తకం "లోకజ్ఞానం" ఇందులో విజ్ఞానం, వినోదం, చమత్కారం ముప్పిరిగన్న లఘు గాథలు పొందపరపబడ్డాయి. యుగధర్మం, చదువుకున్న వానికన్నా చాకలి మేలు, లౌక్యుడు సాముద్రికం మొదలైన లఘు కథలు ఆకర్షకంగా నడిచాయి. "ఫలయాశలు" వంటి కొన్ని దుష్టప్రయోగాలున్నాయి బాల సాహిత్యాన్ని ఎంత వ్యవహారికంగా నడిపినప్పటికీ భాషాస్వరూపం భాషాగౌరవం దెబ్బతినే ప్రయోగాన్ని పరిహరించడానికి జాగ్రత్త పడడం చాలా ప్రధానమనుకుంటాను

ఇప్పటి వరకూ పేర్కొన్న నాలుగు పుస్తకాలూ ప్రజా ప్రచారణలు, పవరుపేట ఏలూరువారి ప్రచురణలు. ధరలు : తాతా మనుమడు- 75 న. పై., అమ్మా కొడుకూ 1-25 న పై.. బిస్కెట్లు- 50 న పై.. లోకజ్ఞానం- 62 న.పై.

అయిదో పుస్తకం "గలగలా గోదారి కదిలిపోతుంటే ...! శీర్షికనుబట్టే వస్తువు స్ఫురణకు వస్తుంది. చల్లనిపిల్ల తెమ్మెరల్లాగానే యీ గేయరచన వల్ల మాదిన విలాసంతో నడిచి గోదావరీ నదీ చరిత్రను కళ్లకు కట్టేట్లు చేసి బుద్ధిని ప్రబుద్ధం చేస్తుంది. పుట్టుక నుండి సముద్రంలోకి పొంగిపొర్లినదాకా గోదావరి నడకలు ప్రధాన ఘట్టాలూ, ఉపనదీ వివరణలు యీ లఘుగేయంలో శ్రీ విశ్వనాథం చెప్పారు.

బ్రహ్మగిరి శిఖరాన ప్రభవించి గోదారి...
కోటిపల్లీకడను దాగింది సంద్రాన.

ఈ పుస్తకం ఏలూరు, ప్రకాశ్ పబ్లికేషన్స్ వారి ప్రచురణ వెల 50 న. పై.

ఆంధ్రత్వ మాంధ్ర భాషాచనాల్పస్యతపసః ఫలమ్ అన్నారార్యులు. ఆ మాట నిలబెట్టుకోడానికి తగిన కృషి ముందు తరాల్లో జరగాలంటే పునాదులు బాలసాహిత్యరంగంలోనే పడాలి బాలసాహిత్య విభాగం ద్వారా ఆంధ్ర సాహిత్య చరిత్రను అభిమాన పురస్సరంగా శ్రీ విశ్వనాథం అందించడానికి అర్హులైన వారని వారి రచనలు చెబుతున్నాయి

బాలసాహిత్య సృష్టికి విషయలోపం లేదు, దృక్పథలోపమే కనిపిస్తున్నది. ఆ లోపాన్ని అధిగమించడంలో శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాథం కృషి సత్ఫలితాల నీయగలదని ఆశించవచ్చు.

-శ్రీ పి. యస్. ఆర్.

• • •

# ఛాయాగ్రాహము

గ్రంథకర్త—శ్రీ వాడ్రేవు బాపిరాజు బి. ఎ. బి. యల్. పేజీలు—176 ప్రకాశకులు—ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు, పశ్చిమగోదావరి మూల్యము—రూ. 5—00

ఛాయాగ్రాహము వైజ్ఞానిక గ్రంథము. ఆంధ్ర భాషలో ఇట్టి గ్రంథమిది వరకు వెలువడలేదు. ఆధునిక విజ్ఞాన రంగమందు ఫొటోగ్రాఫీకి ఎక్కువ ప్రాధాన్యమున్నది. జీవితమునకు సంబంధించిన అన్ని రంగములలోను నేడు ఈ కళ ప్రముఖస్థానమాక్రమించి యుండుట ఎల్లరకు విశదము. సోవియెట్ శాస్త్రజ్ఞులు ఈ రంగమందు ఎక్కువ ప్రావీణ్యత నొందియున్నారు. వారు చంద్రమండలం ఆవలివైపు చిత్రమును ఉపగ్రహములతో అమర్చిన కెమేరా సహాయముతో తీసియున్నారు. ఛాయాగ్రాహము యొక్క సమగ్ర జ్ఞానమును ఆంధ్రుల కెల్లరకూ తెలియునట్లు సులభశైలిలో ఈ గ్రంథము రచింపబడినది. సమస్త విషయములు విపులముగాను సోదాహరణముగాను వివరింపబడినవి. ఛాయాగ్రాహము కళగాగాని వృత్తిగాగాని అవలంభింప సమకరించు ఎల్లరకూ ఈ గ్రంథ ముపకరించును. గ్రంథకర్త ఈగ్రంథ రూపమున తన చిరకాలకృషిని, సూక్ష్మబుద్ధిని, అనుభవమును వెల్లడించినారు. చక్కని అనువాదముల గల్పించి. ఆంగ్ల పదములను గూడ కుండలీ కరణములలో నిచ్చుట ఆకర్షనీయము. ఇట్టి గ్రంథము మద్రాసు విశ్వవిద్యాలయమువారి బహుమానము బడయుట గణనీయము. ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠపాలక సంఘము వారు ఈ గ్రంథమును ప్రచురించినందులకు అభివందనీయములు.

ఈ గ్రంథము మూడు ఖండములుగా విభజింపబడికది. ప్రథమమున ఛాయాగ్రాహ ఖండము. ద్వితీయము—ఛాయాగ్రాహ ప్రయోగఖండము. తృతీయము—అనుబంధఖండము

ప్రథమ ఖండము 5 అధ్యాయములుగా విభజింపబడినది. అందు ఛాయాగ్రాహ సంగ్రహసమీక్ష, గ్రహణ భాగములు, గ్రహణాంగములు, గ్రహణమునకు. సంబంధించిన వివరములు విపులముగా తెలుపబడినవి. వికాస భాగమను 3వ అధ్యాయము, వికాసవిధానములు, కాలపరిమితి, మిగ్రములు, వికాసినులు, ఘట్టములు, నివృత్తి: దిద్దుబాట్లు మొదలగుగాగల వివరములు గలిగియున్నది. నాల్గవ అధ్యాయము ముద్రణభాగమును తెలుపుచున్నది. పంచమాధ్యాయము చీకటిగదిని గూర్చి విశదీకరించుచున్నది.

ద్వితీయఖండము లేక ఛాయాగ్రాహ ప్రయోగఖండము ముప్పది రకముల ఛాయాగ్రాహముల తెల్పుచున్నది అందు Ultra Voilet Photography (అతినీల లోహిత కిరణ ఛాయా గ్రాహము) Portraih Photography ( ఆ లేఖన ఛాయా గ్రాహము) Pictorial Photography (కళా ఛాయా గ్రాహము) Photography by articifial light (కృతక తేజఛాయాగ్రాహము) Mohin Photography (చలనఛాయా గ్రాహము) Under Water Photography (జలాంతర ఛాయాగ్రాహము) Photocopying (ప్రతి ముద్రణ ఛాయా గ్రాహము) Colour Photography (వర్ణ ఛాయాగ్రాహము Tricle Photography (విచిత్ర ఛాయాగ్రాహము) మొదలు గాగల వాని కష్టతరములమ ఛాయాగ్రాహ రహస్యములను విపులముగా అందచేయుచున్నవి.

తృతీయ ఖండమును అనుబంధభాగము. వడపోతలు. Flash bull (మెరపు గండలు) ఉపయోగములు. సంధాన సామాన్య సూత్రములు. గ్రహణముఖ్య సూత్రములు. సామాన్య గ్రహణాధిర పట్టిక. కృతకతేజ వేశపరణి సామ్యము (Equivalance of speed valve systen for articiifial light మొదలు గాగల ముఖ్యవిషయముల ప్రసంగించినది.

ఆంగ్ల—ఆంధ్ర పర్యాయపదపట్టిక, చిత్రఛాయాగ్రాహ ప్రతిరూపములు ఆఖరున చేర్చబడినవి. ఇవి ఎంతయో అవసరము.

ఛాయాగ్రాహ రహస్యముల ఇంత విపులముగా ఆంధ్రులకందజేయు ఈ గ్రంథము కళాభిమానులెల్లరూ చదువదగినది న్యాయవాది వృత్తిలోనున్న శ్రీ బాపిరాజుగారు తమ అనుభవముల వెల్లడించు ఈ గ్రంథమును బయల్పరచి కళాభిమానాలను గొప్ప సహాయ్య మొనర్చినారు. న్యాయవాదివృత్తి నవలంభించుచూ ఛాయాగ్రాహమునకు తమ కాలమును వినియోగించి సమగ్రముగా ఇందలి రహస్యముల గ్రహించి, సేవాభిమానదృష్టితో ప్రజానీకమునకు అందజేసిన శ్రీ బాపిరాజుగారిని ఆంధ్రావని మరవజాలదు.

శ్రీ. డి. వి. యస్



Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్ డివిజను (1961 జనాభా లెక్కలు)

| | | | |
|---|---|---|---|
| వైశాల్యం | ... | ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా | ... | ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... | ... | 20 |
| తాలూకాలు | ... | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | ... | ... | 223 |
| జనసాంద్రత ( చదరపు మైలుకు) | | ... | 340 మంది |

## పంచవార్షిక పశుగణన-1961

| | | | ( వేలలో ) |
|---|---|---|---|
| పశువులు | ... | ... | 121,80 |
| గేదెలు | ... | ... | 69,52 |
| గొర్రెలు | ... | ... | 83,73 |
| మేకలు | ... | ... | 42,55 |
| గుర్రాలు | ... | ... | 73 |
| ఇతర జంతువులు | ... | ... | 6,82 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| | | 1959_60 | 1960_61 |
|---|---|---|---|
| బ్లాకులు | ... | 282 | 326 |
| సగటున వేయిగ్రామాలకు గల బ్లాకులు | | 10.66 | 15.52 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | | 7.72 | 15.52 |
| బ్లాకులక్రింద వున్నగ్రామాలు | ... | 17,887 | 20,823 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | | 1,87,31,000 | 20,701,000 |

## ఖనిజోత్పత్తి

| | | | 1959_60 | | 1960_61 | |
|---|---|---|---|---|---|---|
| బొగ్గు | ... | ... | 2260,000 | టన్నులు | 2596,000 | టన్నులు |
| ముడిఇనుము | ... | ... | 199,000 | ,, | 236,000 | ,, |
| మాంగనీస్ | ... | .. | 16,000 | ,, | 23,000 | ,, |
| అభ్రకం | ... | ... | 3,000 | ,, | 3,000 | ,, |
| సున్నపురాయి | ... | ... | 766,000 | ,, | 1,011,000 | ,, |

